# తొలిపలుకు.



అచ్చతెలుఁగు కబ్బములు వ్రాయు టంత కష్టములోనిది కాదు గాని గ్రంథము చదువునప్పు డది యచ్చతెలుఁ గని తోఁపక మిశ్రకావ్యమువలెఁ దోఁపవచ్చునట్లు వ్రాయనగు. అట్లు వ్రాయుట మాత్రము కష్టతరము. మఱియుం దియ్యని తేఁటతెలుంగుమాట లేర్చి కూర్చుట యన్న సామాన్యము కాదు. "మాటల నాడినవడువునఁ దేఁటతెలుంగునను గయిత తేలికదారిం బాటించి కబ్బ మల్లెద" అని నే నిందు వ్రాసినట్లు మన మిపుడుమాటలాడుకొనునట్టి తెలుఁగుమాటలతోడనే యచ్చతెలుఁగుకబ్బంబులు వ్రాయునభ్యాసము కలిగి నే నీపొత్తము వ్రాసితి నని చెప్ప సాహసించుచున్నాను. "శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్మూష్మ నిర్వచనైకాదశాక్షరి" యను నొకచిన్నిపుస్తక మనేకనియమములతో త,న,జ,డ,క,ర,గ, ల, ద, ట, య, అను పదునొకం డక్షరములు మాత్రమే గ్రంథ మంతలో నగపడునట్లు వ్రాసి యుంటిని. "కాళిదాసమయూరాదికవులకైనఁ గలవు దప్పులు" అనుటం జేసి యెట్టివారి కైనఁ దప్పులు పడుట తప్పదు. కావున నిందు దోషములు లే వని చెప్పఁజాలను.

ఈకబ్బము నేను గొన్నినాళులక్రిందటనే రచించి యుంచితిని. దీని నెవ్వరి కేని ఒక్కమహారాజునకుం గానుక వెట్ట వలయు నని సంకల్పము కలిగినది. సర్వవిధముల సమర్థులు శ్రీశ్రీ పిఠాపురముమహారాజావారగు శ్రీరాజా రావువేంకటకుమారమహీపతిసూర్యారావు బహద్దరు వారని నిశ్చయించుకొని కొన్నిమాసములక్రిందట వారిదర్శనమున కేగి నా కోరిక యెఱుంగ విన్నవించితిని. విని యమ్మహారాజు "నేను గృతిం గ్రహించుటకు సమర్థుఁడను గాను" అని సెలవు దయచేయించినారు. సరే కానిం డని యప్పటి కే నేమియు నొం డాడక యింటికి వచ్చి మఱియుం జర్చించి "ఇప్పుడు పీఠికాపురీశ్వరుండు గాక యచ్చతెలుంగుఁ గబ్బముల గౌరవం బెఱింగినవా రరిది యనియు, ఆప్రభువే వాని యభిరుచి యెఱింగినప్రోడ యనియు నెంచి యయ్యేలికయనుమతిం గొనకయే యి ట్లాదొరపేర నీగ్రంథము ముద్రించి ప్రకటించితిని.

కవిత్వము చెప్పనేర్చిన నే నీయేఁబదిసంవత్సరములనుండియు ననేక దేశంబులం బరిభ్రమించి యనేకుల కనేకకృతు లిచ్చి వారిచే గౌరవింపఁ

బడుభాగ్యముంగంటిని గాని దానవిజితరాధేయుఁడును, విద్యాభోజుఁడును, జయార్ద్రహృదయుఁడును, కవితాప్రియుండు నగు స్వదేశప్రభువును సందర్శించి యేదేనొక్క ప్రబంధము కృతి యిచ్చి వారిగౌరవమును గాంచలేకపోయితి నను నాకొఱంత నిట్లు చేసి తీర్చుకొన్నవాఁడ నయితి నని నాకిపుడు గలిగినసంతస మింత యని చెప్ప నశక్యము.

అచ్చతెలుంగుప్రబంధ మనఁగాఁ గేవలదేశ్యపదములతో రచింపఁబడినదానికే చెల్లును గాని తక్కినదానికిం జెల్లదు. చెల్లకున్నను మన పూర్వులు తద్భవాన్యదేశ్యాదిపదములు చేర్చి కూర్చి నదియు నచ్చతెలుఁగనియే చెప్పి గ్రంథములు చేసి యున్నారు. నేను నట్లే దేశ్యాదులు చేర్చియు దీని కచ్చతెలుం గని పేరు పెట్టితిని. ఇంతియకాక యిందు గ్రంథాదిని "ఆదిత శ్శ్రీశబ్దప్రయోగా ద్వర్ణగణాదిశుద్ధే రభ్యుచ్ఛ్రయ శ్చ" అనుటం జేసి తెలుఁగు గాకున్నను మొదటిపద్యములో శ్రీకారమునుం జేర్చుటయే కాక సంజ్ఞావాచకములాంధ్రము కాకపోయినను బూర్వులవలెనే యిందు యథేచ్ఛముగా వాడి యున్నాఁడను. తెలుఁగులోఁ బ్రాసము లెందులకుఁ బుట్టినవో తెలిసినకారణంబునం జేసి నా కిష్టం బయిన ర, ఱ ప్రాసము లిందుఁ జొందుపఱచితిని ఇందుఁ జూపట్టుకల్పన లన్నియు నేను గల్పించినవే యైనను "బాణోచ్ఛిష్టం జగత్సర్వ"మ్మనుటం జేసి "ఇది నాదియే" యనుటకు సాహసింపఁ జాలను.

ఈగ్రంథము మహారాజావారికిఁ గృతి యీయవలయు నని నిశ్చయించుకొనినప్పుడు మహారాజావారివంశానుచార మంతయు సంపూర్ణముగా నిందు వర్ణింప నెంచితిని గాని గ్రంథము మహారాజావారిసేర ముద్రించుచున్నట్లెవ్వరికిని తెలియకుండం బూర్తిచేసి ప్రకటింప వలయు నను తలంపుతో నట్టిగ్రంథము లెవ్వియుం బరిశీలించుటకుఁ గాని, తెలిసిన వారి నడిగి తెలిసికొనుటకుఁ గాని వీలుపడినదికాదు. ఆకారణముచేతనే మహారాజావారియు, మహారాజ్ఞిగారియు, వారి పుత్రపుత్రికాదులయు చరిత్రాంశము లిందు సంపూర్ణముగా వివరింపబడియుండలేదు. ఈలోపము లన్నియుద్వితీయముద్రణమందు సవరించుకొందు ననిమనవి చేయుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

శ్రీరస్తు.

# బ్రహ్మానందము

ఇష్టదేవతాప్రార్థనాదికము.



లన్మేల్మి నెసంగుముజ్జగములం జెన్నారి తన్జేరి జే
జేలెల్లన్ జయపెట్టుచుం గొలువ వాసిం బెల్చునం బొల్చి కై
కోలెచ్చన్ బజ నేలువేల్పు మచుచుం గోర్కుల్ దగందీర్చి మేల్
గ్రాలన్ రావుకొలంబుమానికము సూర్యారాయనిం బ్రేముడిన్.

చ. అరుదుగఁ బాలవెల్లి మును నచ్చరచానలతోడఁ బుట్టి తా
మరలను మెట్టి నల్లనయమానగుపేరెద నానిపట్టి యె
ల్లర గరువంపుఁగన్గిరపుఁబం దనలోఁ గొని వెల్గునట్టి యా
సిరిదొరసాని మంగయమచిన్నికొమారునిఁ బ్రేముడించుతన్. 2

ఉ. వెన్నునిబొడ్డుఁదమ్మిఁ గడువేడుక నల్తల లున్నబిడ్డఁడై
క్రన్ననఁ బుట్టి నిక్కపుజగంబున నోళ్ళుల నాలు గ్రాలఁగాఁ
బన్నుగఁ దమ్మిగద్దెపయిఁ బైకొని బూమెలు సేయు బమ్మలో
నెన్నుచు సూర్యరాయు నెద నెల్లపుడు న్నన రొప్ప మన్చుతన్. 3

క. వెలిమేనునన్ వెలినగవున్, వెలితమ్మిం గొలువుసేఁత వెలయ జగములన్
వెలసివెలింగెడుపలుకులపొలఁతుకమాసూర్యరాయువేడ్కన్ బ్రోచున్

క. పసిపిల్ల పగిది మెలఁగుచు, విసువక జగమెల్లఁ బ్రోవ వెలసినసత్తిన్
బసగలిగికొలిచియెంతయుఁ,గొసరుదుసిరులిచ్చికాచుకొనమాసూర్యున్

సీ. ముగురై యెసఁగువేలుపుల కిక్కయై యెపుఁ
డలరి ముజ్జగముల వెలుఁగుచుండు
నన్నిజగంబుల కాదరు వగుపెను
మినుపోఁదల్లి నెవండు గనినతండ్రి

కటికచీఁకటి తిండికాఁ డయి యెల్లర
కన్నయి వెలుఁగు నేగాములదొర
తనదు తేజునఁ జందురునకు నగ్గికి వెల్గు
లిచ్చి వెల్గించు నేయివముసూఁడు

తే. వెలయు నతఁడు వెన్నునికన్ను వేఁడివేల్పు
చదలురతనంబు చెయ్వులసాకిరి చలి
వెలుగునకుఁ దోడు వేడివేవెలుఁగులదొర
రావుసూర్యరాణ్మహీపతిఁ బ్రోవుఁ గాక. 6

తే. విద్దెలకు గాదె యన నొప్పుపెద్దబొజ్జ
గజ్జె లందెలు గదలంగ గుజ్జుకాళ్ళ
నల్లనల్లన మెట్టుచు నాట లాడు
నేనికమొగంబుదేవర నెంతు నెడఁద. 7

క. పుట్టినయప్పుడ పుట్టం, బుట్టినతేసియలు గ్రోలి ముసు కబ్బంబుం
బుట్టించె నవఁగఁ జవ్వలం, బట్టిన జడదారికయిత బవి యని యెంతున్.

క. తొలిపలుకు లమ్చుకట్టియు, నెలమిం దొలిబాసఁ బదియు నెన్మిది పాత్రం
బులు నన్ని తోడిపాత్రం,బు లొనర్చినయట్టితపసి పాడ వగ్గింతున్. 9

తే. పలుకుఁదొయ్యలి మగమనఁ బరిషవిల్లె
జగమునం దశి పజ లెన్నఁ దగలి పొగడఁ
బెక్కు లొకబ్బములు చవుల్ వెలయఁ జేసి
వాసి కెక్కినయకాళిదాసుఁ దలఁతు. 10

క. మువ్వేలుపు లనఁదగి మొగి, మువ్వురుసను భారతంబు మునుదెల్గునుడిన్
నివ్వటిలం గా సలిపిన, ముప్పురఁ గబ్బంబు లల్లుప్రోఁడల నెంతున్. 11

తే. కన్నకొడుకులకన్న న న్నెన్ని గార
వమునఁ జదువు చెప్పినయట్టివారి గొప్ప

వారి కగువారి నయ్యవటూరినాగ
లింగ మయ్యవార్లఁగారి వంగి కొలుతు. 12

క. అవధానము లనువిద్దెలఁ, దవిలితిఁ గడుకబ్బములను దగ సలిపితి నేఁ
గవిసార్వభౌముఁ డైతిని, నవు నన శ్రీపాదకృష్ణుఁ డనియెడివాఁడన్. 13

క. మాటల నాఁడిననడుపునఁ, దేటతెలుఁగునను గైతఁ దేలికదారిం
బాటించి కబ్బ మల్లెదఁ, దాటాదూటములు వచ్చుతఱి నవ్వకుఁడీ. 14

వ. అని యిచ్చవచ్చినవేల్పులకు మ్రొక్కు చెల్లించుట మొదలుగా మొదట నడవఁ దగిననడవడుల నెల్ల నడపి జగంబులం బొగడిత కెక్కిన ట్లొక్క చక్కని యచ్చతెలుంగుకబ్బంబు సలుపం దలంచి యొక్కనాఁడు. 15

సీ. రావురాచకొలంబురతనమ్మై నన్నెకు
నెక్కినచాగకాఁ డిజ్జగమున
వెరవరియై పిఠాపురమునఁబడియెడు
మాగాని యేలెడుమణివకాఁడు
మంగయమ్మారాణి బంగారపుంబొజ్జ
పంటయై పుట్టినవన్నెకాఁడు
కైత నేరిచి తెన్గుకబ్బంబు లల్లెడు
వెరవరులకు నెప్డు పెట్టుచెట్టు

తే. అతఁడు వెలమవఁగసమున నసముఁ గాంచి
లే దనెడుమాట యెన్నఁడు లేక యెల్ల
పేదలకుఁ గొంగుబంగరు వై దలిర్చు
రావుగంగాధరునిసూర్యరాయఁ డలరు. 16

సీ. వేడుకకేనియు నాడి తప్పనివాఁడు
పలికి బొంకనివాఁడు వెలమయొడయఁ

దొక్కబమ్మముఁ గొల్చుచుండెడువాఁడు చ
దివినవా రనిన గారవము సేయు
విద్దెల నెప్పుడు వేడ్కమై నరసి ప్రో
వను దొరముం గట్టుకొనిన మేటి
తనకన్నపజ నట్లు తననేలపజలను
గనికరంబునఁ జూచి కాచువాఁడు

తే. ఎందు నేనాఁట నోటమి యెఱుఁగ నతఁడు
పట్టు పట్టిన విడువని యట్టిదిట్ట
యనదలను నక్కటికమున నరయువలఁతి
పుడమియేలికలందుఁ బెంపడరుపబువు. 17

చ. దొరలకు మేలుబంతి యని తోఁపఁగ వచ్చి మెలంగుచుండు నా
దొర కెఱిఁగింతు నన్నమదితో నట కేగి తలంప దంతయుం
బరఁగెడుచొప్పునం దెలియఁ బల్కితిఁ బల్కిన నతఁ డౌ! బళీ!
కరమరు దట్టికబ్బమును గైకొన నేఁ దగ నంచు నెంచెటన్. 18

తే. అనుటయును నేను మదిలోన నబ్బురపడి
యేలికా! యేను దగ నందు వేటిమాట!!
జగమునం దొక్కరుఁడు నీకుఁ జాలినట్టి
చాగకాఁ డుండునే నేలసాములందు. 19

సీ. తినఁ గట్టఁగా లేనిదిక్కుమాలినవారి
నేల నేల న్వేల నిడితి వీవు
కోకనాడుకలేజి కే కాక వే ల్వెక్కు
చదువుబడులకు నొసంగి తీవు
చదువరులందు బల్ సన్నఁ గాంచినవారిఁ
గడ నుంచుకొని ప్రోవఁ గలిగి తీవు
వేనవే ల్వెచ్చించి మానుగ సూర్యరా
యనిఘంటు వ్రాయింప నైతి వీవు

తే. మంచికబ్బంబు లన్న దో నెంచి వాని
నెన్ని వే తైన నచ్చువేయించి తెలుఁగు
బాస వెలయించు చుంటివి బళిర! నిన్నుఁ
బోల్పుడమిలేఁడు గలఁడె యాపుడమి నిపుడు. 20

ఉ. లేదు నిజంబు చెప్పెదను లేవడిమాటలు వల్కఁ బాడియే
వేడుక నాదుకబ్బమునఁ బెంపును సొంపును కూర్మి నావుడున్
లేఁదు మఱొక్కయప్డు వివరించి నుడిం బచరింతు నంచు న
న్నోడక గారవించెఁ గడు నొప్పమెయి న్నన రుప్పతిల్లఁగన్. 21

వ. నేను నెఁ గాత మని యన్నెలయేలికసెలవు గొని యింటికిం జను
దెంచి దానిన మఱియు మఱియుం దలంచుచుఁ బూగ డ్డ బొల్లని
యతండు న న్నట్లు పలుకుట సాజం బయినగొనంబ కొని వేఱొకఁ
డెద్దియుం గాదు. కై తగూర్పరు లెల్లరు తమకబ్బంబుల నున్నవి
కొన్నియు లేనివి మఱికొన్నియుం జేర్చి పబువుల నగ్గించుచుందు
రందునన తా నంతవాఁ డయ్యు నెంత లెంతవారికబ్బంబుల నైనఁ
గై కొనం దలంపనివాఁ డయ్యె నదియ కతంబున నా కిట్టినుడికారం
బిచ్చెఁ గాని మఱియొం డెద్దియుం గా దని యేర్పఱించుకొని
యయ్యొడయని యియ్యకోలు గొనకుండఁ బూగ డ్డలపొంతం బోవ
కున్నది యున్నట్టు లన్నెలయేలికగొనంబులం బేర్కొనుచుఁ గబ్బంబు
చేసి యారాచమానికంబున కప్పనంబు గావింప నెంచి ముందుఁ గై తకుఁ
గై సేతగా నారావువారివంగడంబు తెఱం గెఱింగించెద. 22

కృతిపతివంశావతారము

తే. పద్మనాయకు లన వెల్మవా రనంగఁ
బేరు గైకొని దొర లయి వెలయువారు
వేవెలుఁగు రేవెలుంగులవై వెలుంగు
కొలములకుఁ జెందుతేం డ్లని తెలియ వలయు. 23

ఉ. రాచకొలం బెదో కతము గ్రాలుట వెల్మగిలంబునాఁగ నై
తోఁచి జగంబునం బ్రబలి దొడ్డగొనంబుల నొప్పుచుండు నా
కూచికొలంబువా రెపుడు గొప్పతనంబును బాయ కుండియున్
రాచరికంబు రేవల నొనర్తురు వారలు రాచవారలే. 24

క. కావున వారికి బీరముఁ, జేవయుచుం బట్టుపలయు సిరియు ననంబున్
గావలసినంత తేగము, లో వెలయంగలిగెఁ బుడమిలో దొరతనమున్.

వ. ఆవెలమవా రెప్పుడు రేచర్ల, రేవచూళ్ళ, రేపాల, లోనగుడెబ్బది యేడు తెగలవారై రందు రేచర్లవారిలోఁ గొంద ఱొడయండ్లు పుట్టినవెనుకఁ జెవ్విరెడ్డి యనుపిల్లలమఱ్ఱి బేతాళనాయుండు పుట్టి యోరుంగంటిపీటఁ గాకతిప్రతాపరుద్రగణపతిదేవులచెంత మాగాణంబులం గాచుమన్నీఁడునుం దళవాయియు నై పేరంది పొగడితకెక్కి రేచర్లకొలంబునకు మొదటివాఁ డని యసంబు గాంచె నారేచర్లవంగసంబు (గోత్రము)లో రావువారు, వెలుగోటివారు, సురభివారు, సూరానేనివారు లోనగునింటిపేళ్ళు గలవారు ముప్పదియాఱు తెగలవారుగలరు వారిలో రావువారు తూర్పుమాగాణంబు లేలుమణివ కారై పేరుపొందిరి. 26

క. అలరావుకొలమువా రొ, జ్జలు విలువిద్దెలకు దొరలు జగముదొరలకున్
బులుగడిగినముత్తెంబులు, వలఁతులు నొడయండ్లు పజకుఁబరికింపంగన్

వ. ఆవెలమదొరలలోఁ దూర్పుమాగానులం బేరు మ్రోసిన బొబ్బిలి యనురాచప్రోలం గొంద ఱొప్పి రాలకింపుఁడు. 28

ఉ. గిబ్బవజీరు ముమ్మోనలఁ గేరెడు వాలున కైనఁ గానలో
బెబ్బులికోఱ కైనఁ గనిపించెడు నించుక వాడి పీడుటల్
బొబ్బిలిపీటి కోట నడఁ బుట్టినదోమయు వాడిపోడిమిన్
గొబ్బునఁ బెద్దయేనికకుఁ గోల్తల సూపెడుఁ బట్టి నెట్టనన్. 29

వ. అట్టి యశంబు గాంచిన వారిలో మొదటిలెక్కకగు రంగరాయండోల
మాస గొనక తనకోట ముట్టడింపవచ్చిన వేనవే లగుకఱకుతురక
మూఁకఁ గోడం బోరి పోకార్చి తనపొలంబువారిక కాక తెలుఁగునాటి
వారికిం బేరు దెచ్చె నట్టి పేరుగలరావువా రెల్లవోల్లం బేరెన్నిక
కెక్కి రంత. 30

తే. వారిలోపలఁ బెక్కండ్రు వరుసతోడఁ
గడఁగి నేలకు తేండ్లై జగంబుపజల
నరసి యేలు చుఁ గడచినయంత మీఁద
వెలసె నీలాద్రిరావను బిరుదుమగఁడు. 31

వ. ఆతండు తనతాతదండ్రులు గడించినపిఠాపురం బనురాచటెంకినేలుచుఁ
గాపురంబుండె నదియును. 32

సీ. పదియు నెన్మిది యయి పరఁగుపీటములందుఁ
బురుహూతికాంబ నెద్ద పొదలుటెంకి
చెఱకుపానకము నాఁ జెన్నారునేలేరు
పాఱు నేప్రోలికిఁ బ్రక్కనుండి
యేవీటిదసుచక్కి నెప్పుమనుఁ బాఱెడుఁ
జెఱుపలకాలువ చెన్నమీఱి
బిందుమాధవుఁ డను వెన్నుఁ డేపేటలోఁ
గుక్కుటేశ్వరుఁ గూడి కోర్కె నుండు

తే. పోలినాటికి నేప్రోలు మొదటిలెక్కఁ
బొదలుఁ జమువుల కేయూరు పుట్టినిల్లు
అట్టినుడికారమును గన్నయట్టిదగుచుఁ
గాపురంబున కనువు పిఠాపురంబు. 33

ఆ. అది కళింగములను మొదటిప్రోలని వైచు
వేలయేండ్లనాఁడు మేలుపొత్త

ములను రేఁగుగడ్డఁ బుట్టినతపసిరా
యందు వ్రాసె దానిదండితనము. 34

వ. ఇట్లు జగంబునం బొగడిత కెక్కినట్టిపిఠాపురము మాగాణంబునకు
మన్నీఁ డయిన నీలాద్రిరాయందు. 35

తే. పుడుకదోడుకుకన్నను వేల్పుపొలకువ్రమాఁకు
కన్నఁ గడునీఁగిచే వాసి గన్నయొడయఁ
డగుచు నెల్లరఁ దనుపుచు ననువు మీఱె
నాజనిర్మాదారుఁ బొగడంగ నలవి యగునె. 36

చ. చదివినవారలం బజల సాఁకఁజేయుటె కాదు వార లె
య్యది తనుఁ గోరినన్ విసువ కయ్యది వారల కిచ్చి నిచ్చలున్
వదలక ప్రోచె రైతు లగువారిని బిడ్డల యట్లు కాచె నె
య్యదనున నెట్టొసర్ప నగు నట్లు పొనర్చెను రాచకర్జముల్. 37

మ. చెఱువుల్ తోటలు బావల న్నిలుపుటల్ జేజేలగు ళ్ళాళ్ళ బం
గరువుం బూడ్చుల లోప్పబావులు కడుం గబ్బంబులం బేరు ల
బ్బుర మెచ్చం గను నిల్పుటల్ సలిపి యప్పాల్పొందుటేఁ డెంతయేఁ
బెరిమం బారులపట్లకున్ వడుగులుం బెండ్లింండ్లు చేయించె ముగా. 38

తే. నేలపైఁ బుట్టి మిక్కిలి నెఱి నెసంగు
పెట్టుచె ట్టని కైతలఁ బేరుఁ గాంచి
పుడమి యేలుచు నెంతయుఁ గడిమి మెఱసి
రమణమైఁ గ్రాలె నీలాద్రిరాయఁ డతఁడు. 39

క. గరితతనంబున సత్తిం,బురుడించును మించు ననఁగఁ బొలిచినపడఁతిక
గరితన్ భామాయమన, ప్పార పెండిలియాడె నసము దొలఁకాడంగన్

సీ. నిలుకడ లేనిదై నెఱి నెల్లరను గూడఁ
బడి చెడు లచ్చి యేపాటియదియొ

తలవాఁకిళుల నెప్డు నిలిచి పెన్ఱాఁగ యా
పలుకులచాన యేపాటియదియొ
మగఁడు గొల్వంగ నింపుగ సందెలను గద్దె
నాటాడుసత్తి యేపాటియదియొ
మగని గాదని మాఱుమగనిపొందికలకు
మాటాడుశచియు నేపాటియదియొ

తే. అనుచుఁ గడుదూఱుచుం దనపెనిమిటి యెద
నిలిచియును బల్కునెలవున నెలమి గొనియుఁ
గలసియు ననుంగుఁ గూర్చుచు మెలఁగికొనియుఁ
గొలుచుచుండు భావాయమ్మ గొనము పమ్మ. 41

వ. అయ్యాలుమగళ్ళకు సూర్యారావు, కుమారవేంకటరా వనునిద్దఱు
కొమాళ్ళు పుట్టి రందు సూర్యారావు. 42

సీ. నడయాడ నేర్చిననాఁడె పున్నెము గాలు
గడుగుల నడపె నీపుడమియందు
నత్త తాత యటంచు నాడ నేర్చిననాఁడె
యలహరిశ్చంద్రునిహరువుఁ దాల్చె
నోనమాల్ నేర్చెడునానాఁడె చాగంబు
టాఁకుల వ్రాయుచొ ప్పరసికొనియెఁ
జీఱలు గట్ట నేర్చిననాఁడె కుడికేల
బీదలఁ బ్రోవంగ బిరుదు గట్టె

తే. రమణయమ్మను బెండ్లియై రమణమెఱయ
వీదులం దేగుఁబెండ్లికై వెడలునాఁడె
వెడఁదయసమనుసకి నేల వెడల నడిచెఁ
బాఁగడఁ దగడె సూర్యారావు పుడమితేఁడు. 43

వ. ఆసూర్యారావునకు ధర్మారావు, వేంకటమహీపతిగంగాధరరామా

రావు, వేంకటరావనుముగ్గురు కొమాళ్ళు పుట్టిరందు వేంకటమహీపతి గంగాధరరామారాయండు. 44

సీ. తనయునం జెప్పు లచ్చిని౽ బల్కుఁజెలిఁ గట్టఁ
గని బీతుఁ గొని పాఱి కడలు దాఁటె
దనచాగ మావేల్పుమనికిపట్టున మను
మొదవును సిగ్గుమై మునిచి మించెఁ
దన తేజు వెలుఁగువెన్ను నికంటికన్నను
దిన్ననై జగముగఁ దేఱి మెఱసెఁ
దనదొరతన మెల్లరను గన్నతలిదండ్రు
లను మఱపించెడు పనిగ నేలె

తే. నాఁగఁ బొగడొందఁ దగి కొనసాఁగు నెవఁడు
రావుబహాదర్ మహారాజరాజు మొదలు
గలుగుబిరుదులు గొని రావుకొలమునందుఁ
బ్రబలె నల్లగంగాధర రామరావు. 45

సీ. కడఁగి పాల్కడలిలోఁ గాఁగిలింతలఁ దేరి
యవ్వేలిమలమీఁద నాటలాడి
చలువలతేనితోఁ జెలికార మొనరించి
గిబ్బరాయనిమీఁదఁ గెరల కెక్కి
ఱెక్కరాయనితోడ నెక్కసక్కెము లాడి
యలవేలుపులగారు నక్కఁ జేర్చి
వెలిమ్రాఁకుతోఁ గోరికల నెల్ల నెలకొల్పి
చిలువయేలికతోడఁ గలసి మెలసి

తే. నారదుందొట్టివార్ తనవారు గాఁగ
వలుముకొనిముజ్జగంబులయందు విరిసి

ప్రోఢ మై తిరుగాడు నెప్పుడును రావు
కొలమురాయనియన మనునలరునెలఁత. 46

క. ఒకవిద్దె నేర్చి యతఁ డిం, నొకవిద్దె న్నేర్వఁడనఁగ నొప్పదు జగమం
దిఁక లేవు విద్దె లనఁ బొం, దికమైఁ గలవిద్దె లెల్లఁ దిరముగ నేర్చెన్.

తే. బులుసుపాపయ్యశాస్త్రికి ముప్పదియును
హింగుకోనేశశాస్త్రికి నెన్నియేని
యకరములనేల నిచ్చియు ననయ మెల్లఁ
జదువరులఁ బ్రోచె సిరు లిచ్చి చదురుఁ డతఁడు. 48

సీ. పలువురకా న్నిమేబడుల నేల లొసంగె
నూళ్ళు పల్లెలు చాల నొప్పఁ జేసెఁ
దనతండ్రిపేరఁ గట్టెను గోకనాడుచెం
తను సూర్యరావుపేటను, బిరావు
రమునఁ గుమారుపేరను నగరము గట్టె
మల్లవరమ్మున మఱియు సూర్య
రావుపేటం గట్టెఁ ద్రవ్వించె, జెఱువులు
తోటలు నెలకొల్పె మేటిదేవ

తే. ళమ్ము కట్టించె సర్పవరమునందు
రావువంశముక్తావళి నా వెలసిన
కబ్బమును గొని చేసినసుబ్బరాయ
శాస్త్రికిం బసదన మిచ్చెఁ జాల మెచ్చి. 49

వ. ఆ యొడయండు తొల్లి శ్రీకృష్ణుండు పెక్కురం బెండ్లియాడినట్లు మంగయమ్మ, సీతయమ్మ, సుబ్బయమ్మ రాఘయమ్మ భావయమ్మ, లక్ష్మీసీతయమ్మ, రామయమ్మ యను యేడ్వురు దేవేరులం బెండ్లియాడె నందు మొట్టమొదటిదేవేరి మంగయమ్మరాణి. 50

ఉ. ఈలువు గన్నతల్లి మది నెప్పుడు పెన్మిటిమాట కడ్డుగాఁ
బోలు నటంచుఁ బల్కుటకుఁ బోయియెఱుంగదు పల్కి బొంకుటల్
కోలుమసంగి యుండుటలు కోడిగముల్ పచరించుటల్ గనం
జాల రొకప్పు డామెకడ సత్తికి నెత్తగు నామె యన్నిటన్. 51

క. అలమేల్మంగమయీయమ, కలుముల చెలియనఁగనొప్పెఁ గలవారికిన్నై
కలవారియింట మెలఁగెడు, మెలఁకువకై మంగయమ్మమేలుంగాంచెన్

క. గరిత యనఁ దెలివి గలదనఁ బేరిమిన్ సిరులొసఁగిపజలఁ బెంచెడునదినా
నరయఁగ నగుగంగాధరు,దొరసానిం బొగడఁ జెలువదొరయుంగలఁడే.

వ. ఆమంగయమ్మ దేవేరి యందా వేంకటమహీపతిగంగాధరరామరాయండు వేంకటకుమారమహీపతిసూర్యరాయనిం గనియె నారాయండును.

ఆ. చిన్నతనమునందె కన్నతండ్రియుఁ దల్లి
పుడమి విడిచి చనుట నిడుమ కయ్యెఁ
బగతు రెన్నియేని యగచాట్లఁ బెట్టిరి
కాని వమ్ము లయ్యె వానిపట్ల. 55

క. చదువుం జదురును మున్నై
పొదలఁగ, దా వెనుకఁ బుట్టి పొదలెడు వనఁగాఁ
జదివెడునదనున నెల్లరఁ,
బొదలంగాఁ జేసెఁ జిన్నపుడె యాతఁ డొగిన్. 56

ఆ. అతఁడు పుడమియేల నమరినదొర యైన
నాఁడుగోలెఁ బజలు పోడిమియును
హాయి గలిగి కన్నయత్తలిదండ్రులఁ
దలఁప రతఁడె తల్లి దండ్రియు నని. 57

చ. "గొనములు గుంపు గూడి పజకున్ మదు లుల్లసిలంగ జేనిరూ
పును గొని సూర్యుఁడై పుడమిఁ బొల్పుగఁ బుట్టెనొ లేక తల్లి దా

గొనముల నుగ్గునన్ మెదిపి కొమ్మని పోసెనొ బొజ్జలోనఁ గా
కను వగునగ్గొనంబు లిటు లారయ నాదొర కేల కల్గెడున్. 58

చ. తనతలపోయుకర్జ మది తప్పక తా నెఱవేఱనట్టి దై
తన కెదు రేగుదెంచెడు వితంబున నయ్యెడు నెల్లనాఁడునన్
మునుపటి వైనపుట్టువులఁ బొల్పుగఁ జేసినమేటిపున్నె మే
యని పజ లాకొమారు ననయంబును మెచ్చుచునుందు రిచ్చమై.59

ఉ. భారత మన్ననాతనికి బత్తియు సత్తియు సంతసంబు నా
భారత మెన్నిరే పరులు వల్లె యొనర్చియు నందు నొకతల్
గోరికతో నెఱింగియును గొంతనరాని కడంకఁ బున్నెపుం
దారి మెలంగు నట్టిఁ డగు నల్వురు మే లని మెచ్చు మచ్చునన్.

సీ. పుడమిపైఁ బొడమిన పుడుకుమానిక మన
నడుగ లే దన కిచ్చునట్టివాఁడు
తనపజ్జ నూర్లు వేలు నొసంగి చదువరు
లను బెక్కురను నిల్పుకొనిన మేటి
తెలుఁగుబాసం దేటతెల్లం బొనర్చుక
బ్బముసేయ వే లిడ్డ పబువుమిన్న
యనదలొవారల నక్కటికంబున
నరసి కాపాడెడునట్టి ఱేఁడు

తే. విద్దెలకుఁ గాను వేలవే ల్వెచ్చఁ బెట్టి
పెట్టుచెట్టనఁ బేరంది నట్టిదిట్ట
కడిఁది మోమోట గలిగినయెడఁదవాఁడు
రావులకు మానికము సూర్యరాయఁ డెన్న. 61

మ. "దునియామే నహీ రాజ" యన్ననుడి కై తోరంపురాలచ్చితోఁ
జను నప్రావులవంగసం బనెడు మేల్సంద్రంబునన్ లచ్చి వా

సినిఁ బు ట్టంది సిరుల్ చెలంగ నగు లక్ష్మీచిన్నమాంబన్ జగం
బున తాం జ్జెన్నఁగఁ బెండ్లియాడి మిగులం బాల్పొందు నాతండిటన్.

సీ. గరితతనంబునఁ బురుడించు ననసూయ
నోరిమిం బుడమికి నుద్ది వచ్చుఁ
గడిమి వేలుపుతేనిగరితకు నెనవచ్చు
సిరుల లచ్చికిఁ జాటి చెప్ప వచ్చుఁ
బుడుకున దేవళ్ళతోడుకుతో జతపడు
దొరతనంబున సత్తి దొరయ వచ్చుఁ
జమువునం బలుకులసకియకు జోడగుఁ
జదురున సీతకు సాటి వచ్చు

తే. అనుచు నెల్లరుఁ గొనియాడునట్లు మగని
కెప్పుడుం దోడునీడయి యెడము లేని
కూర్మి పేర్మిమై నెంతయుఁ గూర్చు చుండు
నట్టి దగుచు లక్ష్మీచిన్నమాంబ దనరు. 63

తే. చదువు సంతల నేమంబు జరుపుటయును
మంచినోములు నోఁచుట మంచికతల
వినుట పెనిమిటి బత్తిమైఁ గనుచునుంట
యామె నిచ్చలు పొనరించు నట్టిపనులు. 64

వ. ఆచిన్నమాంబయుం దారాచమానికంబు వేంకటమహీపతిగంగాధర
రామారావు, వేంకటమహీపతిసూర్యారావు నాఁ బడు నిద్దఱు
కొమారులను, మంగయమ్మ, భావయమ్మ, సీతాదేవి, కమలాదేవి
యను నల్వురు కొమరితలం గాంచె నందు వేంకటమహీపతిగంగా
ధరరామరాయండు. 65

శా. తానుం దమ్ముఁడు రామలక్ష్మణులు నాఁ దళ్కొత్తి యెల్లప్పుడున్
మేనున్ నీడయుఁ బోలెఁ బాయక మదిన్ మే లెంచి పోలించుచున్

జా నొప్పంగను విద్దెలం జదివి పెల్చన్ రాచకర్జంబులం
బూనం జాలి మెలంగుచుండ్రు దొర లెప్డున్ మెచ్చుమ చ్చేర్పడన్.

శా. కైతం గట్టఁగ నేర్చి పేర్చినతమిన్ గబ్బంబులం గూర్పరుల్
జోతు ల్దేఱుచు నున్న వంచుఁ బొగడన్ జోడించి కావించుచున్
జోతల్ సేయుచుఁ దల్లిదండ్రులను గొల్చున్ రామరాయండు తాఁ
దాతం బోలినతేగముం గలిగి హత్తర్క సొంపు పెంపొందుచున్. 67

తే. అతఁడు చేసె స్వార్థత్యాగ మనఁగ మఱియు
నవలిలోకమునుండియాహ్వాన మనఁగ
నామరహితము, తరగలు నాఁగఁ జినకు
చిందు లనఁ గబ్బములు కైత చెన్నుమీఱ. 68

చ. చెలఁగెడుపీటప్రోలుదొర చిన్నకొమారుఁడు సూర్యరాయఁ డిం
పలరుచు విద్దెలం జదివినట్టిఁడ యై తనుఁ గన్నతండ్రియుం
దలియును నన్నయుం దెలుపుదారి మెలంగుచుఁ బెద్ద లన్న మి
క్కిలియును గారవంబు గలిగించుచుఁ బెంచుచు బత్తిఁ గొల్చెడున్.

ఆ. తెలుఁగుకైపు చేయఁ గలమిష నొక్కండు
చేసి తల్లిపేరఁ జిన్నమాంబ
కైపుమిష నటంచు రూపు గావించె నా
తండు తనదుచదురు దండి కెక్క. 70

చ. చదువరు లన్నఁ గైతల నెసంగెడు వా రన మంచిపద్దెముల్
చదువుట యన్నఁ గబ్బములసాము లనన్ మఱి వారిపొందు నాఁ
బొదలుచు మంచిచైదములు పోహణ సేయుచుఁ బెద్ద లందు బ
త్తి దగిలి తేగకాఁ డయి పదిం బదిగాఁ గను నాతఁ డెల్లరన్. 71

మ. కొడుకుల్ గూఁతులునాఁతియుం గొలువఁగొర్కెంజేసి మాగానులం
గడిమిం గైకొని యేలుచుం బజకు వేడ్కం గూర్చుచుం దన్ను వేఁ
డెడు వారిం గని కాదు పొమ్మనక మేటిం జేయుచుం గోర్కె లె
ప్పుడునుం దీర్చుచుఁ బెట్టుచె ట్టనుచు మెప్పుంగాంచె సూర్యుండొగిన్

క. అలసూర్యమహీపతి గొన
ములు నడవడు లొప్పు లబ్బములు విని కనువా

రలకే తెలియఁగ నగు నేఁ
దెలుపుట కొండాట గామి తెల్లము గాఁగన్. 37

సీ. ఎవ్వానియింటిలో నెప్పుడుఁ దామరతంప
రై పాడిపంటయు నలువు మీఱు
నెవ్వానిముంగిట నిసు మిడ రాలని
యట్లు ప్రజల్ వచ్చి చరుగుచుండు
రెవ్వానికొలువున నెల్లరు ప్రోడలు
చదువులఁ బెనువాదు సలుపుచుండు
రెవ్వానిదొరతనం బెల్లప్రజల నొగి
నారసి బ్రదికించునట్టి దగును
తే. అతఁడు పీటప్రోల్ సర్కారు నారయునొడ
యం డగుకుమారసూర్యరాయండు సుకము
సిరులు కొడుకులు కూఁతులు పరఁగఁ బుడమి
గలుగు నందాక మనఁ గాక చెలువు మీఱు. 74

పష్ఠ్యంతములు.

క. అలరావువంగసం బన
వెలసినపాల్కడలిఁ బుట్టి వేల్పులవేల్పుం
గొలుచుచు నందఱకన్నుం
గలువల నలరింపఁ జేయఁ గలరాయనికిన్ 75

క. దేవళ్ళమ్రాఁకు మానిక
మావున్ బిడియమునఁ ద్రోయు నలువున జగముం
దీవులవాఁడై గొనముల
తావై వెలుగొందునేలదాలుపు దొరకున్. 76

క. అంకిలి లే కీజగమున, సంకెల లెడఁ బాపి ప్రజల సాఁకగ నగుమే
ల్బొంకపుఁ గనికరపుగనికి, వేంకటమహీపతికి మేటిబిరుదుమగనికిన్.

వ. తరుగనిసిరులు నమరుకొమరులును గడుమనికియుం గలిగించు నట్లు వేల్పులవేల్పున కప్పనంబుగా నాయొనర్పంబూనిన బ్రహ్మానంద మను నచ్చతెలుంగు కబ్బంబునకు నిబ్బరం బగుత్రోవ యెట్టిదనిన. 78

# బ్రహ్మానందపురాణము

## ప్రథమాశ్వాసము.



క. కొంతన కంతటిలోఁ దా, నంతయుఁ దనలోన నిండ నంతయుఁదానై
యింతకునింతయునంతకు,నంతయునై వెలుఁగువేల్పుననయముఁగొలుతున్

### కథాప్రారంభము

తే. నైమిశం బనునడవిలోఁ బ్రేముడిఁ గొని
శౌనకుం డనుజడదారిచందమామ
యడుగఁ గతివేల్పునడుగునఁ బొడమినట్టి
కొలముజడదారి యిట్లని పలుకఁ దొడఁగె. 2

తే. అలపరీక్షితుఁడు శుకునివలన మంచి
కతల వినుచు నీపుడమికిఁ గలుగఁ జేసెఁ
దనదుపే రతం డెవ్వఁ డతనికొలమ్ము
గొనములును నెట్టియవి తెల్పు మనియె నలని. 3

వ. అనిన నతం డతని కిట్లని చెప్పం దొడంగె. 4

### స్వాయంభువుమను వంశము.

మ. పలుకుంబోఁటిమగం డెదం దలఁపఁగా స్వాయంభువుం డన్నపే
రలరం బుట్టి కొమారుఁ డంత మనువై యాతం డొగి న్మజ్జగం
బుల నేలెన్ శతరూపఁ బెం. యయి యపూర్వాభోఁడియం దిర్వురం
గొలముం దేజనఁ గూర్చుపుత్త్రురులఁ గోర్కుల్మీఱఁ గాంచెం జుమీ.

తే. బడిఁ బ్రియవ్రతుఁ డుత్తానపాదుఁ డనఁగ
నలరు నయ్యిద్దఱు కొమారు లందుఁ బెద్ద
వాఁడు గొనములఁ దేజనఁ జూడఁ బెద్ద
యనఁగఁ గొనియాడఁ బడియెఁ బ్రియవ్రతుండు. 6

చ. అతఁ డిలు నింటియూబిడను నిగ్గియునుం బెడబాయకుండి త
న్నతికినవేలుపుందబిసి యూడికపాటలు వట్టి యాడ్రి ము
చ్చితి నన నేల యేలి కడుఁ జెన్నలరారియుఁ బెక్కులేండ్లు శా
సుతకుఁ బసిండిపుట్టమును జుట్టినవేలుపులోనఁ జేరెఁ బో. 7

వ. అంతనాప్రియవ్రతుండు తేఁజై విశ్వకర్మకూఁతు రగుబర్హిష్మతి యను నామెయందు నాగ్నీధ్రుండు లోనగుపదుగురు కొడుకుల నూర్జస్వతి యనునొక్కకూఁతు నొందుదేవేరియందు నుత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు ననుముప్పురుకొడుకులం బడసి యెన్నియే నేండ్లు నేల యేలుచుఁ బసిండిగట్టుచుట్టునుం దిరుగువేఁడివేల్పు వెనుకటికి చక్కంగల చీఁకటులం బెడఁబాపుదు నని చీఁకటిగొంగతేరితోడ నీడయినతేజుఁ గల తేజిలం దేజరిల్లునొక్కయరదం బెక్కికొని రెండవసూర్యుడుగం బేఁ నేడునూఱు లామలచుట్టునుం దిరిగె. అపుడయ్యరదంపు గిఱ్ఱలయం చులదారు లేడు నేడుసంద్రంబులు నానడిమిసందు లేడు నేడుదీవులు నయ్యె నవ్వి జువ్వి, నేరేడు, జెల్లు, కొంగ, కారర, బూరుగు, తామర యను పేర్లనొప్పె. అందు నేరేడుదీవి నూఱువేలయామడలు కొలత గలది. తక్కినయాఱు నొండొంటికి రెండింతలు పెచ్చుపెరుఁగు అట్టి తేజుగల ప్రియవ్రతుండు పుడమిం గొడుకులకుం బంచియిచ్చి తాను రాచతబిసిమై తుదకు మీఁదిజగంబున కరిగి నిలిచియుండె నంతట. 8

శా. తన్నుం గన్నప్రియవ్రతుండు చన నాతర్వాత నాగ్నీధ్రుఁడున్
మన్నింపం బజఁ దండ్రియట్ల పొదలింప న్నేర్చి నేరేడుదీ
వి న్నేమంబున నేలెఁ బెక్కు లగుచున్ విన్నాణ మానేండ్లు దాఁ
గన్నాకై యెకిమీఁడులందు ననముఁ గాటంబుగాఁ బెంచుచున్. 9

ఆ. అతని వేలు పన్న నన వచ్చు గొనముల
గనియుఁ గనికరంబు గలుఁగువాఁడు
వాఁడనట్టిసిరులు వడసినయొడయండు
వంగసమునఁ జాల వన్నె కెక్కె. 10

క. కడునేం డిట్లాతఁడు తన, పడఁతుకతోఁ గూడి పంటవలఁతిని నెమ్మిం
గడుకొని గ్రేలుచు నుండియుఁ, గొడుకులు లేఁ టివగనుగుతిలంబడుచున్.

వ. తనడెందంబున నొక్కనాఁ డి ట్లని తలపోసె. 12

చ. కుడువఁగఁ గట్టఁ గల్గినను గొల్లఁగ సొమ్ములు దాల్చి పొల్చినన్
మడఁతులపిండు గొల్చి కడు మన్ననఁ జేయుచు నంటి యుండినన్
గడఁ గొన విద్దెలం జదివి క్రాలెడువా రయినం దలంపఁగాఁ
గొడుకులు లేనిమానిసులకుం గుదురింతయుఁ గాదు నెమ్మదిన్. 13

శా. కా ల్సే యాడుచు నెంతదాఁక సిరులం గావించు నందాఁక నా
స ల్పాగించుచుఁ గూడి మెత్తు రతనిన్ సైఁదోడులు న్నెయ్యు రి
ల్లా ల్పుబ్బా ల్సరివారు నెల్లబలగం బాయింతయుం దప్పి ము
క్కా ల్సేరం జనునప్పు డెవ్వరును గ్రేగంట నం బో రయో. 14

ఆ. నడికి వెలిచి మైనఁ గడుఁ బ త్తి నైనను
గన్నవా రటన్న గారవమున
నైన ముదుక లైనయ త్తిలిదం|డులఁ
గొలిచి తిరుగువాఁడు కొడుక సుమ్మి. 15

క. తనకున్న వారు పున్నెము, లను గనరని తెలిపె మున్ను లచ్చిమగం డం
దున నే నేవగపెంపునఁ, గని పుత్తురు జమునిజాడఁ గనకుండెదనో. 16

మ. అని నేమంబున నిల్చి పుత్తురులఁ దా నందంగ లో నెంచి చ
య్యన నాకవ్వపుఁగొండవండ కొకరుం డందండఁ బెంపొందువా
రిని జేజేజడదారిరాయ లగువారిన్ బమ్మము న్నెమ్మదిన్
గనువారింగన ఁగొంచుఁబోయి యొక చోఁగా లాఁచె మేలూనుచున్.

ఉ. సొరగుగబ్బిగుబ్బలులఁ జాల్కొనునా సెలయేటినీళులన్
దీరినగున్న మామిడులఁ దీయనిపల్కులు నక్కలంకులన్
జేరగఁ బల్కుచిల్క లట నేలపడంతుక పాలు చేఁపు రా
వారక కన్నవారి కిడ వారలు కోరిక నాడున ట్లగున్. 18

చ. తమ కగు లేఁజిగుళ్ళు కొఱఁతం బడఁ గాయలుఁ బండ్లు పిట్టచా
ల్నమలగఁ జూచి కిన్కమెయి నల్లడ మెట్టుచు మాపితోఁపులోఁ
గమరగ ముల్కు లేరుకొనఁ గాంతు వొకో యనునట్లు కోయిలల్
గమికొని కూయుఁ గో యనుచుఁ గందుని రమ్మని పిల్చునో యనన్.

మ. పెరవాఁడై తొవకన్నెలం జెరుపనై వేవేగుల న్వోగ్గపో
రికిఁ జూడం దగదంచు వెన్నునిమది స్త్రెంచు నప్పంటబి
త్తరి పై మేలిముసుంగు వేసికొనె నా దట్టంబుగా నొండొకం
డొగయం గల్గినతోఁపు లాపొలమునం దొప్పారు నెప్పట్టునన్. 20

వ. అట్టిసోయగంబు గలపున్నెంపుఁగోనలో నొక్కచక్కనితావున. 21

చ. కడుకొని నేమముం దనరఁ గా రయి రాలినయాఁకలంబు లేఁ
గుడువక గంతులాడుమదిగుజ్జముఁ గక్కులక్లే మేమొ నా
నడ రెడునేర్పునం దిగిచి యాఁగఁగఁ బట్టి కడంకతోడఁ దా
నెడఁద బసిండిబొజ్జఁ గలయేలికఁ గొల్చుచు నిల్చె బత్తిమై. 22

తే. ఇట్లు తబుసులు కొనియాడునట్టు లేండ్లు
పూండ్లుగా బమ్మఁ గొల్చుచుఁ బొనరుచుండు
తఱిని నామున నామని దాపరించెఁ
బుడమిపై నెట నుండియో వడిగ వచ్చి. 23

వసంతఋతువర్ణనము

తే. ఏచె మావులు గ్రోవులు నిప్పలుఁ గడుఁ
బూచె మల్లెలు మొల్లలు మోదుగులును
గాచె దానిమ్మనిమ్మలు గన్నెరు లిగు
రాచెఁ జెట్టులు చేమలు నట్టియెడల. 24

ఉ. కమ్మనిమావిపూవులను గాలువఁ గట్టడుతేన లాని జుం
జుమ్మని తేంట్లు పాడెఁ గడుసొం పలరార నిగుళ్ళు మేసి కో
కొమ్మని గండుకోయిలలు గూసెను జిల్కలు గోరువంకలున్
ముమ్మరమైనపండ్లఁ దిని మొత్తముగా వగఁ బల్కె నత్తఱిన్. 25

చ. కొలఁకుల నీటఁ బోటులను గూడుచు వేడుక నాట లాడుచున్
కొలకొల మంచుఁ గూయుచును గోపులు సూపుచుఁ దమ్మిగద్దెలన్
నిలుచుచు నావులించుచును నిక్కుచు నీల్గుచుఁ ద్రెంచి తూండ్లు ము
క్కుల నెగిరించుచుండి కనుఁగోఁ దగె నంచలు కన్నుఁబండువై. 26

చ. గమగమలాడుతావి గడుఁ గ్రమ్మెడుపుష్ప జవాది పచ్చక
ప్రము నునుపచ్చనాకుఁబోడి పచ్చికచూరము మల్లెయత్తర
ద్దమరుపసిండిగిండె నిడి యంపిగఁ జేసినమంచిచల్వగం
ధము మెయినిండ నొండొరులు దాలిచి హొత్పద రాల్మగ ళ్లొగిన్.

మ. చలువల్ గ్రమ్మెడుపూలపందిరులపజ్జ న్జాజిపూఁదోటలో
మలెపూఁబొన్నసఁ బండియాలు మగఁడున్ మైహాయి మైఁదేల్చుచున్
లలి నేతెంచెడులేఁతపయ్యెరను రేల్పాటించుచు న్నిచ్చలు
న్వలరావానిదురంబున న్వలఁతులై నల్వొందిరయ్యామనిన్. 28

మ. చిలుక ల్గోరలు దేంట్లు గోయిలలునుం జీగాబులుం జీల్గులున్
బలగం బెల్లడఁ జుట్టువారుకొన రేవ స్జల్కుమా వెక్కు రే
పులును న్మామపులుఁ దుంటవింటఁ బువుఁదూఁపు ల్గాచ్చి పూవిల్తుఁ డా
చెలికాఁ డామని తోడు సూప జగముం జెండాడె నయ్యుజ్జనన్. 29

చ. మెలిఁ గొని యొండొకం డరయ మిక్కిలి చిక్కఁగ నున్నమావితోఁ
పుల నలవోక మొత్తముగ బుల్గులు గూయఁగఁ బూవుఁదేనియల్
జలజల రాలి నేలపయిఁ జాల్కొన నెమ్మలు చూచి కారుమ
బ్బు లురుముచుం గడుంగురియుఁబో యిపు డన్నమనాడు నత్తఱిన్.

చ. పొలుపుగ నొక్కట న్విరియఁ బూచినమల్లెపొదం గడంగి తేఁ
టులు గలయంగ వ్రాలి యెపుడు న్విడకుండఁగ నొప్పె నప్డు పెం
పలరఁగఁ బెండ్లియాడి యట నామనివెన్నుఁడు తోటచచ్చియుం
దొలి కటిరాలు ముత్తెములునుం దలఁబ్రాలుగఁ గొన్నప్రొ వనన్.31

క ఆమనిఁ బొదలెడు సోయగి, మేమని మెచ్చంగ వచ్చు నెంతటివారిన్
వే మరునిబారి కగ్గల,మై మెలఁగుచుఁ గుతిలఁ గుడువ నల్లు విరాళిన్.

వ. అట్టి సొగసులకు నెల్లఁ దానకం బగునట్టియామని సమయంబై నేల నేలుచున్నయెడ నిక్కపుజగంబున నున్న తమ్మిపుప్పొడి తెన్ను నమ్మి యున్నట్టిరాచపట్టిం జేపట్టి ప్రోవ సమకట్టి కట్టిదురం జవులు పుట్టఁ బాట వాడుచున్నట్టిపూర్వచిత్తి యనునచ్చరమచ్చెకంటిం బొర పొచ్చెము లేనిముచ్చటం జూచుచుం బిలిచి పని యొసంగించి గుంచు టయు మంచిది యనుచు నాబోఁటి తోడిబోఁటులతో నాపలుక యున్నతోట కరుదెంచి చిగురువచప్పరంబు లనం జొప్పడునట్టిచెట్ల నీడల నాడుచుఁ బూఁబొదలందూఱుచుఁ దీఁగయుయ్యాల లూఁగుచుఁ గేళాకూళు లనంజనునేటిపలఁ దేలుచుఁ బూలు గోయుచుఁ జివురులం జిదుముచుఁ బూఁదేనె లానుచుఁ బుప్పొడులం గప్పుకొనుచు నాడుచుం బాడుచు నుండె నట్టియెడ. 33

వ న వి హా ర ము

ఉ. చిలుకలముక్కునొక్కులను జెల్వగుమారెడుపండ్లు సూచి నె
చ్చెలులను గన్నుమొఱంగి యొకచేడియ వేడుకతోడ నాడ కిం
పలరఁగ నేగి వాని కెనయై తగి యుం దనచన్నుదోయి నొ
క్కులు గనరామికి న్వగచెఁ గొంచెము గానివిరాళిఁ దూలుచున్. 34

తే. ఓలి నచుఁ గిన్నగోవాళ్ళయుల్ల మిట్టు
లట్టు నిట్టును దూఁగాడు ననుచు నేమొ
గోల యొకతె యుయ్యాల జంపాల యనుచు
లాలిఁ బాడుచుఁ దీఁగయుయ్యాల లూఁగె. 35

మ. చెలులారా! కనుఁగొంటిరే చిలుకతేజీరౌతు నో మూనఁ గొ
ల్లలుఁగాఁ గోసినపూవులందుఁ బడి యీలా గిప్పు డీతేఁటు లెం
గిలి గాఁ దేనెలు గ్రోలి యేగు నళు లీగెం గాన సంపంగి మొ
గ్గలునుం గేదఁగిపూలు డెం డనియె నొక్కర్తెల్ల గానా ననన్. 36

తే. అట్టినెడ నొక్కసకి యొక్కయలరుఁదీవ
గట్టిగ నొకచెట్టునఁ జుట్టఁ బెట్టుకొనఁగఁ

గాంచి తమి నెంచి మైఁ బులకించి మిగుల
నగలఁ బొగిలె మరుఁడ! యిబ్బు లిగి దటంచు. 37

మ. ఒకయీరంబున గండుకోయిల యొకం డొప్పంగఁ గూహూ యటం
చొకమా రార్చిన మిండగీ నొకని న ప్పల్లంబున న్నిల్పి మే
నొక యింతైన నెఱుంగకున్న నవలా యొక్క ర్తతం డంచుఁ బొం
దిక నోహో యని యేగఁ జొచ్చె నటకున్ మేలంబు సేయం జెలుల్.

మ. చెలియా! యామని తీవకూనలకునుం జెల్వొందు లేమావిగు
న్నలకుం గూరిమిఁ బెండ్లిచేసి యిదె చెంతం బొల్చుగొజ్జంగిపూ
వులలో బుజ్జవ మారఁ దేటుల కిడున్ బోనంబుఁ బూజంపుబం
తులు సాఁగించుచుఁ జూడు మం చొకత యెంతో సంతసంబందెడున్.

మ. పొదరింటం బువుఁదేనె లానుకొనుచున్ బుప్పొళ్లు పైఁ గప్పుకొం
చుఁ దగం జేడియ లొంటొరు ల్వెడల నవ్వోఁ బచ్చవిల్తుండు హే
చ్చొదవ న్మూఁడుజగంబుల న్గెలువఁగా నుంకించి వాలమ్ములన్
బదనుం బెట్టఁగ జాపొడిం గలయఁ బైఁ బైఁ బూసెనో నాఁ దగెన్.

వ. ఇట్లు కడుదెఱంగుల వేడుక నాటలాడు నచ్చరచేడెల యొయ్యారంపు
నడలం గదలుకమ్మలుం గాజులుం గడియంబులున్ సూడిగంబులున్
రవలయొడ్డాణంబులు న్మెట్టె లందియలు లోనగురవణంబులచప్పుళ్ళ
నప్పుడుఁ దెలసి యప్పుడమిఱేఁ డల్లనఁ గన్ను విచ్చి చూచునంతలో
నయ్యింతులచెంత నెంతయు సంతసమ్మునఁ దుమ్మెదకొమ్మయుం బలెఁ
బువ్వుతావి మూరుకొనుచు సింగారంపునడకలకోపులచేతను నేపు
చూపువగల చూపులచేతను దీటగునాటపాటలచేతను వాట మగు
మేటిమాటలచేతను జేజేజడదారులనేని మరుబారిం బడవేయుచుఁ దన
మోముదమ్మిం గ్రమ్ముకొనుతుమ్మెదల దిమ్ముల కోపక వడివడి నడచు
టంజేసి తడఁబడునడుగులు గలపూర్వచిత్తి కన్నుఁబండువుసేయుటయు
నొడలెఱుంగ కతండు తనడెందంబున. 41

సీ. కనుపండువై మదిఁ గరఁచుచుండెడు నిది
పొంగారుబంగారుబొమ్మ యేమొ
బంగారుబొమ్మ కీపసతావి గల్గునే
పసిమించుజాజిపూబంతి యేమొ
జాజిపూబంతి కీసరితళ్కు గల్గునే
సరిక్రొత్తమెఱుపులజంట యేమొ
మెఱుపులజంట కీమెలఁకువ ల్గల్గునే
చెలరేగుమరునిరాచిలుక యేమొ
తే. మరునిరాచిల్క కీచిన్నె లరయఁ గలవె
యలరునలరువిల్తునిపువుములికి యేమొ
యొసఁగుపుప్పుముల్కి కీవన్నె లెన్నఁ గలవె
కోర్కెలీడేర్చుముద్దులగుమ్మ యేమొ. 42
ఉ. ముద్దులగుమ్మయే నిజము పోలిచిచూచినఁ దోచెఁ దీనిమే
న్నిద్దర జాళువాపసిఁడియా ? మెఱుఁగారుమెఱుంగు గుంపులో
నిద్దఁపుజోతియా ? యనుచు నెమ్మది సందియ మందఁ జేయునీ
ముద్దియ నెట్టిమంచిపనిముట్టులఁ జేసెనో బమ్మ నేర్పునన్. 43

స్త్రీవర్ణనము

తే. జాళువాపైడిపొడియు జేజేలబువ్వఁ
బదనుగాఁ గల్పి దాన నిప్పడఁతిఁ జేసి
నలువ మెఱుఁగున మెఱుఁగిడె నలర నిట్లు
కావయే నిట్టిసొగసెల్లఁ గలుఁగు నహహా. 44
చ. తలకక మమ్ము శేల్పెఱచుదాయను గెల్చియ వానిచుట్టలం
మెలపితి మంటి కొల్చి మన మీరును దొల్లిఁటిబాముసందు మా
తలఁ బడినా రటంచు దుడుగుఁదమ్ము లనం గని క్రమ్మొక వచ్చునో
వెలయఁగఁ దేం ట్లనం దగియె విప్పినయీసకిసోఁగపెన్నెరుల్. 45

చ. మొగి మలపందురుం గరఁగి పోసిరొ తాత యొనర్చె నంచు మున్
దగిలి జగంబులో నుడువ దబ్బర యం చనుకొంటి మార! చ
క్కఁగ నెల యయ్యెఁ డాసి కనఁ గానియెడన్ మనకన్నుఁగల్వ లిం
పుగ విడ నేటికి న్నిజము బొం కరయం గదఁ దేట తెల్ల మా. 46

ఉ. పూవిలుకానివింట్లు సుమి పోలిచి చూడఁగ దీనికన్బొమల్
కావునఁ జూపుటమ్ము లిటు గాటముగా మెయిమీఁద వ్రాలి యెం
తేవడి డెందముం బగుల నిట్లొనరింపఁ గడంక వోఁగ మై
చేవఁ దొఱంగి యుంటి నగుచేఁతలు దక్కె విరాళిఁ దూలుచున్. 47

తే. కోటికాంద్రమములు వట్టఁ గోరి మరుఁడు
పన్నియుంచినవల చుమీ కన్నెకురులు
గానఁ బెళుకుబేడిస లన నైనకన్ను
లేగుఁ గాఁబోలు జానుగులాఁగ లంట. 48

క. పున్నమచందురుఁడగు నీ,కన్నియ నెమ్మోము బొట్టు కందగు నగవే
వెన్నెలలు గాయ నెల్లర,కన్నుంగలువలును విచ్చి కడుసిరి నలరున్.

క. చినిపూఁదేనెయుఁ బోనక,మును బాలుం బంచదారపాడియుఁ గా మఱి తీ
యనివానిఁగూర్చి పగడం,బున మెఱుగిడిచేసెనలువపాలఁతుక పెదవిన్.

క. పువ్విలుతుఁ డీదఁ గలిగెడు, జవ్వన మనునేరెడేటఁ జనుతరగలు నా
నెవ్వలనఁజూడ నొప్పెడు,జవ్వనినుఁగడుపుమీఁదసవ్వరై ముడుతల్.

మ. మునుమే నియ్యది నెక్కమె నిది యనం బొల్పొంద నారెంటిసం
దున నేర్పాటుగ బొడ్డుబా ట్టిడఁగఁ దోఁత్తో నెంచి కల్పించు వే
ల్పెంయం బ్రాడునఁ జుట్టి తూఁచె నట నెంతే నొత్తుటన్ సన్నమై
చనునాఁ బొల్చె నెలంతకౌను గనుఁగో నక్కెంబుగా కేరికిన్. 52

తే. మేటితమ్ములతోడనో లేఁటచిప్పరు
గములతోడనో కమఁ బోరఁ గలుగునట్టి
యీసులోఁ బుట్టి నాఁగ నీయింతియడుగు
లరయఁగా నొప్పుఁ దొగరుచాయలను గనుచు. 53

ఉ. ఈనడ లీయొయారములు నీసొగ సీబలునిటు లీబెడం
గీనెఱిచూపు లీవగలు నీపస లీత్రగునేర్పు లీహారం
బీనగుమోము నీతళుకు లీపెనువన్నెలు చిన్నె లెన్నఁగా
నీనవలాక చెల్లు నిదియే మరునేలెడిబోఁటి గాఁ దగున్. 54

వ. అని తనమదిలోనం గోర్కి దైవాఱఁ గైవారంబు సేయుచుఁ జెఱకు
విలుకాని విరికోలలతాఁకులకుం దాళఁ జాలక లేచి దానికురంగటకుఁ
జని యిట్లనియె. 55

రాజర్షి పూర్వచిత్తితో సంభాషించుట

చ. వెలఁదీ! యెవ్వరిదాన వెవ్వతెవు నీపే రేమి యెందుండి యీ
పొలఁతుల్ గొల్వఁగ వచ్చితీ వలరు నిప్పూదోఁటకు న్మేటివై
వలజేనిం గికురించివచ్చురతివో వాఁ డంప నిందున్నవా
రల నేచం జనుదెంచుపూములికివో రా రమ్ము వాకి మ్మొగిన్. 56

వ. అని పలుదెఱంగులఁ బలికిన నప్పలుకులు విని పైకి లేనికినుకం గనఁ
బఱచుచు నక్కలికి మెలఁకువం జంకించుచు ని ట్లనియె. 57

శా. ఏమేమీ! మునిముచ్చవా? తెలిసె నీయాగోఁచివేసంబు నీ
నేమంబున్ జడదారి వంచు వెఱ వో నీచెంగట న్నిల్తు మి
ట్లే మేరో మఱిమాఁగొనంబుకత యె ట్లెట్లో మదిం జూడ ?
మై మాట ల్పచరించి వేఁడుకొన నీమై నిబ్బరం బొప్పునే. 58

`. బలుతపసి వంట నాఁకల,ములఁ బొట్టం బోసికొనుచు మొగిఁ గాఱడవిన్
మెలఁగుదు వంట సొగసుక,త్తెలఁ గని మరుబారిఁ జిక్కి తెగి తంటబతే.

మ. విను మాయచ్చరమచ్చెకంటులతెగల్ వెల్గొందుచు న్నేర్పు పెం
పున నిం పుష్పతిలంగఁ బాడుటలు గోపుల్మీఱఁగా నాడుటల్
ననవిల్కాఁ డతఁ డొజ్జగా నెఱఁగి నానాఁటన్ జగం బెల్ల గె
ల్చినమే మీనినుఁ దెల్పి నల్వ కెటుగాఁ జేయింతుమో చూడుమా.

వ. అని గద్దరించి పలికిన దద్దఱిల కతం డమ్ముద్దియ సొబుద్ధకు నొద్దిక
మీఱం జని నిద్ద మగుతనసుద్దుల బుద్ధిపుట్టించిన నదియు న్నొకపనిక

మెట్టుచున్నయది గావున దానికి నియ్యకొని యతనిచ్చవచ్చిన
మచ్చున మెలంగె. అతండు నయ్యచ్చరమచ్చెకంటిం గూడి యూడె
పీడునకుం జని వేడుకలం దేలి తేలి నాభిలోనగుకొడుకుల నేఁటి
కొక్కనిగఁ దొమ్మండ్రం గని నూఱువేలయేండ్లు పంటవలంతి నేల
నాభికిం బుడమిబరువు గట్టిపెట్టి పూర్వచిత్తితో నిక్కఁపుజగంబుల
కరిగె పదంపడి. 61

నాభివృత్తాంతము

తే. అల్లపొక్కలి పేరిరాయుండు గడఁగి
జాళువాకొండకూఁతు రై గ్రాలుమేరు
దేవి దేవేరిఁ గాఁ గొని దీవిమీఱ
నెన్నియే నేండ్లు నెమ్మిమై నేలెఁ బుడమి. 62

వ. ఆనాభియునుం గొడుకులం బడయఁ జాలక పసిఁడిదువ్వలువదాలు [illegible]
గొలుచు నట్టిమేటిజన్నంబు వట్టి మెలంగుటయు నంత నాదేవర[illegible].

సీ. జేజేలరాఱాల జిగిడీల్పఁ జాలుమై
హొంబట్టుచెంగెంబు డంబుమీఱ
నునుబోరఁ గౌస్తుభ మనుమానికపుఁబేరు
మొయిలఁ గాక్మెఱుఁగునా మొనయుచుండఁ
గెంగేలఁ దలకట్టు సింగాణి వలమురి
గుదుసువా ల్గుదెయును గొమరుమిగుల
నెలమి దేవేరులై కలిమిలేమయు నీల
యును నేలచామయుఁ దనరఁ గొలువ

తే. నెల్లవేల్పులుఁ దబుసులు నెఱఁగుచుండఁ
గరువలిని దూరువడి గలగరుడి నెక్కి
కొడుకులకుఁ దన్నుఁ గొలిచెడుపుడమిఱేని
కడకు వేంచేసె మిగులనక్కటిక మొప్ప. 64

వ. ఇట్లు పొలిచి నాభిం బిలిచి నీ కేమికావలయు నొసంగింప సిద్ధపడి
ననిన నతండు భక్తిఁ దనుకొ త్తెనియడుగులంబడి చాఁగిలి మ్రొక్కి
దేవరా! నీకుఁ బుర దగుబుత్తురు నొసంగు మని వేఁడుటయు నాతండు
నాకు బురుడు నేన కాని మఱి యొక్కరుండు లేఁడు కాన మీకు నేను
గొమరుండనై పుట్టఁ గల నని పలికి నెపరుఁ జూపుచుం జూపులకు
జూపట్ల కెట కేనియుం బోయె నంత మేరుదేవియు. 65

సీ. మూలాత్ర తగ నీరు మోసి కదురోజాల్పున్నెముం సూర్యమ
న్మే లీ శౌలగనంబునందుఁ గనియెన్ వేగ్రోదుమైవానిసర్
జాలం దేజునఁ దేజరిల్లుమొగము న్దానొందుకన్దోయియున్
గ్రాల న్మద్దులుఁ గుల్కువానిఁ గొమరున్ రాచిన్న నెసెన్నసెన్.

మ. అంతఁ బుత్తురుఁ డైనవెన్నుని నల్లపొక్కలిపెటిపోఁ
డెంతయేనియు సంతసంబున నెంచి ప్రేముడి కొంతయున్
గొంత భక్తియు నుల్లమం దయి గొప్పగాఁ బెనవేయ కొ
క్కంత నిల్పక యింటఁ బారుల కిచ్చె సొమ్ములు వేనవేల్. 67

తే. తెలుపుడా ల్గలమేననను బలిత మున
బలిమియును జాలఁ దేజునుగలకొమారుఁ
డెలివి నారసి నాభి పే ర్వేలయఁ జేసె
బుషభుఁ డనుచును జగ మెల్ల నెఱిఁగికొనఁగ. 68

వ. అంత నాబుషభుండు తెల్లతెక్కజాబిల్లిపగిది నాఁడు నాఁడునుం బెరిఁగి
పెద్దవాఁడు గా నెఱింగి తండ్రి తనబుజంబునం గలనేలబరు వతనిబుజం
బునం బెట్టి పడంతితో నడవుల కరిఁగె నంత బుషభుండును. 69

క. పితరులయట్టులు నెమ్మది,మితి యింతయు లేనినెనరు మీఱఁగఁ బజలన్
సతమును జేకొని విడువక,బ్రతికించుచుఁ బుడమినేలెరాయండొకుమెన్.

చ. అరయఁగ వెన్నుఁ డాబుషభు డంతట మబ్బులనెక్కరౌతుచే
నరుదుగ నీయఁగాఁ బడి జయంతి యనంజను కన్నెఁ బెండ్లి మై

భరతుఁడు గొట్టిపుత్త్రుల బాగుగ నూర్వురఁ గాంచె నందు నా
భరతునిపేర నిప్పుడమి భారతవర్షము నాఁ దలిర్చెడున్. 71

వ. ఆ ఋషభుండు పెక్కేండ్లు పుడమియేలి నూఱుజన్నంబులు చేసి యిక్కడిసుకంబు సుకంబుగాదు. అక్కడిసుకంబ సుకం బనియంతయుఁ దిగఁద్రావి తాను జడదారులం జేరువాఁడై యొక్కనాఁడు కొడుకులం జీరి యిట్లనియె. 72

ఋషభుండు పుత్త్రులకు నీతు లుపదేశించుట

తే. కొడుకులార ! చిన్నతనంబునడుచు తఱిని
బత్తి నొజ్జలకడఁ జేరి పాటుపడుచు
ననయ మక్కరంబులుగోలె ననువు మీఱ
విద్దె నేర్వఁగ వలయును బుద్ధి గదుర. 73

ఉ. ఒజ్జలె తల్లి దండ్రియును నొజ్జల రాయఁడు వేల్పు నంచు నే
యజ్జన నెంచుచుం దగినయట్టులు కొల్చుచు బత్తి మ్రొక్కుచున్
బజ్జను నిల్చి విద్దెలను బాగుగ నేర్వ నగు న్విడం దగున్
రజ్జులు [illegible]డు తెక్కలితనంబును నెల్లరతోడిపోరునున్. 74

ఉ. తల్లియుఁ దండ్రి యన్నలును దాతలు మామలు దొట్టిచుట్టలుం
జెల్లిననెయ్యురుం దనకుఁ జెప్పినచొప్పున మెల్గుచుం జగం
బెల్లెడ మంచివాఁ డనుచు నెన్నఁగ నై వడు గైన పిమ్మటం
దెల్లము మూఁడుసందెలను దేవరఁ గొల్చుచు వార్వఁగాఁ దగున్.

ఆ. పిదపఁ గొలపుటొజ్జ వినిపింపఁ దొలిమిన్కు
గములు మనువునుడులు గడుఁగువిల్లు
విద్దె లోనగు మనవిద్దెల నెఱుఁగంగ
వలయు నడవడికలఁ దెలివిఁ గదుర. 76

చ. కొలమున రూపునన్ పడుచుకోపున నేపునఁ జూపునం గొనం
బులఁ బన కీడు జో డయినపొల్తుకఁ బెండిలియాడి జన్నముల్

వెలయఁగఁ జేసి పుత్త్రుల వేడుకఁ గాంచి జగంబునందు తో
డలరెడురాయఁ డొండొకరుఁ డంచనునట్లు మెలంగఁగాఁ దగున్. 77

క. పుడమిఁగలతనదుప్రజలను, గొడుకులఁ బలె నెమ్మినేలుకొనినేర్పలరన్
గడుసరివారలఁ బ్రెగడల,నిడుకొనఁ దగు దనదుచెంత నెకిమీనిగోరన్.

చ. చెడుగులఁ జెంతఁ జేకొనినఁ జేఁ కగు నెమ్మదిలో వసం బాగిన్
వెడలెడు చెడ్డపేరగును బిమ్మట గల్గెడు రాచదానియుం
జెడియెడు లచ్చి వాయు మఱి చెప్పఁగ దే మిఁక వానిపెంగొదల
పుడమిని బాసి పోవుదెసఁ బుట్టక మానునె యెట్టకేనియున్ 79

సీ. తన్ను మించినయట్టిదాయతో నెదిరింపఁ
జన దెట్లైనఁ బొం దొనరుప నగుఁ
దనకన్న నలఁతియై తారసించినజేని
గెలిచి వానిసిరులుఁ వలయుఁ గొనఁగఁ
దగునట్టు లునిచినదంతుల కెల్ల నో
క్కదళవాయి వలయు గండుమగఁడు
మనువుమాటలు నేర్చి చనవు మీఱినయట్టి
ప్రెగ్గడనుడియందఁ బెరుఁగ నగును

తే. చెలఁగఁ దగినట్లువెచ్చంబు సలుపవలయుఁ
కొడుకుపుత్త్రులకేఁ జను విడఁగఁ జెల్ల
దేడుచెడుగుపనుల నెడ్డ వీడనొప్పఁ
బుడమియేలిక యగువాఁడు కొడుకులార. 80

ఉ. పుత్త్రులార ! యిప్పుడమిఁ బుట్టినమానిసిమూఁక కెల్ల వే
హత్తగఁ జేయుఁ గుక్కలకుఁ నబ్బని పెంగొద లయ్యె కోర్కలం
చెత్తఱి మీర లవ్వలని కేగక ప్రోచుచు మంచివారలన్
గత్తరకాండ్రవై పులను గన్గొన కుండుఁడు మంచిదారిమై. 81

వ. ఆటచేడియలు లోనగుచేడియలం దగులుమిండగీండ్రతోడి పొ...
కెడున కగుఁ బెద్దలతోడిపొత్తు మేలున కగు నీనునుం జెలిమియుం

జూపక దాయలం జుట్టల నొక్కమట్టునం గనుమెత్రినిమది గలవారు
పెద్దలు చెడుపను లొనరించువాఁ డెప్పుడును గొదలపా లగుమేను
లెత్తుచు వెగ డందుచుండుఁ గావున నేవాఁడును గోర్కులం గోర
రాదు తెలివి యెంతదనుక లేక యుండు నంతదనుక మేను లెత్తు
చుండవలయును మేను లెత్తుచున్నంతతడవు నెమ్మది పెక్కుపనులవలనం
జిక్కుకొని నెమ్మదియుం దెలివియు లేక యుండు నది గావునఁ జేత
లెవ్వియుఁ జేయకుండవలయు నెన్నుండ నగునాయందు సంతసం
బెంతతడవు లేక యుండు నంతదనుక పుట్టుచావులు నొగిలించుచుండుఁ
జదివినవాఁడైన నిలు సింటియాబిడం దగిలి వెడఁగై నేను నాయది
యనుతలంపున నుండె నేనిఁ జెడిపోవు నది లేకుండి నన్ను బత్తిం జేసి
మంచిదారులం జనుచున్నవాఁడు పుట్టి చావనివిడుపువేరెతానకంబు
నకుం జని నెమ్మదిం గనుఁ గావున మీరు నన్నె వెన్ననిఁ గా నెఱింగి
నై వారంబు సేయుచుండుఁ డెందు నేమర కంతయు నన్నె కా తలం
చుట తెలివి యనంబడు దీనివలన నీకనంబడులావుమేను చెడి మాని
సికి సుక మగుఁ గన్ను లున్నవాఁడు కాసనివానికిం దారిఁ జూపునట్లు
తెలిసినవాఁడు తెలియునిచెనఁటికి దారి మాప నగుఁ జూపనట్టి తల్లిఁ
దండ్రులు మొదలగు మిట్టంబులు చుట్టంబులు గానివార కాన మీకుఁ
దెలిసిననే సీదారిఁ జూపితి నామే నొరులకుం జూప నెద పున్నెంపు
టూడ ము గలనాకుఁ బుట్టినమీ రెల్లరును మీకన్నయుం గొప్పవాఁడు
నగుభరతుని నన్న కా చూచి కొలిచి నేల యేలుచుండు డిదియ
నాయిచ్చవచ్చినతెఱం గని మఱియును. 82

తే. ఉసురు గలయట్టివారిలో నెసగుఁ జెట్లు
వానికన్నను బాములు వానికన్నఁ
బసరములు వానికన్న మానిసులు వారి
కన్న దేవర్లు మఱివారికన్న బమ్మ. 83

తే. అతని కన్నను ముక్కంటి యతనికన్నఁ
బసిఁడిపుట్టంబుఁ దాల్చురి పసఁ జెలంగు
నతఁడు నేల వేల్పులఁ గొల్చు ననుచు నెఱిఁగి
వారిఁ గనుఁ డెల్లరకుఁ బెద్దవా రటంచు. 84

క. ఈ రేడుజగంబుల నే, వారుం బాలురకు నుద్ది వచ్చెడు వారల్
లేరనుచు మీారు బత్త్రి, న్వారిం గొల్వంగవలయు ననుఁ గొల్చుటగాన్.

వ. అని మఱియుం గొడుకులకుఁ గఱపఁ దగుబుద్ధులు వేనవే లెన్ని యేఁ
గల వవి యన్నియునుం గఱపి ఋషభుండు భరతుని బుడమిఱేనిం
జేసి తాను జన్నంపుటగ్గులు లోన నిలుపుకొని మేనఁ గోకం జుట్టక
వేదాటు చందంబున నెఱులు విఱియఁ బోసికొని యిల్లు విడిచి పిచ్చి
గుడ్డి చెవుఁడు మూఁగ వాఁడుం బలె నేరితోడను మాటలు వలుకక
యొకచో నొకగడియ యేని నిలువక యెల్లెడలఁ దిరుగుచు నొరులు
దిట్టినను గొట్టినను గడవ సేయక యొక్కెడఁ గొండచిలువ యనం
బడి నోటఁ బడినవెల్లైన నమలి తినుచుఁ దనినవారని తోఁచిన
వారిం జేరం బిలిచె వెన్నునిం జేరుదారిం దెలుపుచు నిల్లు కొన్ని యే
ండ్లుండి తుద కొక్కనాఁ డేరికిని గానరాక పోయి లచ్చిమగనితోడఁ
గలసి మెలసి మెలంగుచుండె. 86

క. అన విని జడదారులు సూతుని గని ఋషభుండు చనినతోడన పుడమిన్
గొని భరతుఁ డెట్లు లేలెన్, తని గొనములమిసిమి యెట్లు తెనఁడు చెపుమా. 87

వ. అనియడుగుటయును. 88

ఆశ్వాసాంతము.

ఉ. తనసాటోల్లిటి బాముసం దయించేతంజేసి పెన్నేలకుం
బొసరక రాయఁడయ్యె యసంబు మిగులన్ బొల్పొంది రాలచ్చి మేల్
గొనముల్ మన్కియుఁ దేజు గల్గి పజఁ గోర్కుల్ దీరగాఁ బ్రోచుచుఁ
జనుగంగాధరసూర్యరాయఁడు గడుఁ జారంది పెంపొందుతిఁ. 89

గద్యము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి
ప్రణీతంబయిన బ్రహ్మానంద మను
నచ్చతెలుఁగు ప్రబంధంబునఁ
బ్రథమాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

# బ్రహ్మానందము

## ద్వితీయాశ్వాసము

క. సిరులకు నెలవగు నేలకుఁ, దొరయై దోసలేని నెనరు దొరలఁగఁ బ్రజలం
బరికించి యేలుఁగంగా, ఘనరాయని సూర్యరావు వనరెడు నెపుడున్.

వ. అలకింపు మవ్వలికథ శుకుండు పరీక్షితునకుం జెప్పినట్లు సూతుండు
జపధారులకు కిట్లనియె. 2

### భరతుని చరిత్రము

చ. తనబుజమందు నీపుడమిఁ దాల్పు మటంచును దండ్రి పెట్టి పో
యినతరువాత నాభరతుఁ డేలికయై ప్రజ మెచ్చునట్లు కూ
ర్పనిగొద నేలుచుం బాలము రాఁబడెలోపల నార్వపా లొగిన్
దన కగుకప్పమంచుఁ గొని తాఁ బ్రజకై సెల వెన్ని చేసెడున్. 3

క. తమ్ములఁ బ్రేముడిఁ దొంబది, తొమ్మండ్రను దనకుఁ జేతితోడుగఁ గొని తా
నెమ్మెయి నెమ్మది నేలెఁ, సమ్మదికము బలిసి మూఁడుజగములు నిండన్.

తే. తగిన ప్రెగడలఁ బ్రోడలఁ దనదు చెంత
నిలుపుకొని వారినుడులంద మెలఁగుచు నెపు
డెట్టిగొదలు నేరికి నంటనట్లు వంట
నాతిప్రజఁ గన్నయ ట్లేలె నాతఁ డపుడు. 5

చ. తనర నతండు నేమమున దక్కనపుం దెసనుండి మంచుగ
ట్టునకొకమాఱును న్మఱిఁ గడుం దగఁ బశ్చిమనుండి తూర్పునై
పున కొకనారెయుం బుడమి పాల్చినదాఁకను జన్న మొప్పగా
నొనరిచె నొక్కఁదానిసుద నొక్కటిగాఁ బగ నైచి సాలలన్. 6

తే. అపుడమి తేనిజన్నములందు నెల్ల
యెంతెయులును వచ్చిరని వేఱ నుడువ నేల?

నేలవేలుపులును నింగివేలుపులును
గూడి సాబంతిఁ గుడిచిరి కోర్కు లలర. 7

ఉ. ఆతఁడు నాలుగుందెసలయందును గెల్చును గొన్నచిన్నెకై
పాఁతినపొన్నకంబములపట్టున జన్నపుమేటికంబముల్
పాఁతెను గప్ప మిచ్చి కొలువం దొర, లిచ్చలు దీర్ప వేల్పులున్
బ్రాతరలాడుచుం బ్రతినివాకిటఁ గ్రిక్కిరియంగ నెప్పుడున్. 8

వ. ఆదొరతేగం బెంతనఁ, గాఁదగునో యతని నరయగా వచ్చినయే
పేదయుజ్క్కలదొరకున్, మూదిరియనఁ జెప్పనొప్పెమఱియున్మఱియున్.

ఆ. విశ్వరూపుఁ డనెడుపేరఁ బిలిచ్చెడు
సామికూఁతుఁ బంచజని యనంగ
మించుకన్నెమిన్న మంచిలగనమందుఁ
బెండ్లియాడె నతఁడు గొండ్లిమీఁఱ. 10

చ. గొనములప్రోవతం డెడఁదఁ గోరిక లేకయె కాపురంబునం
దును దగులంబు నొంది తమితోడను గుమ్మరిపుర్వు వోల్చువొ
ల్పున వెలుగొందుచున్ సుమతి లోనగువారలఁ గాంచె నేవురిన్
మానువుగ నప్పంచజనియం దెవరిండని మెచ్చఁగా పొరల్. 11

తే. తండ్రము లేలినకరణి నాతఁడు చేఁత
లన్ని విడుచుక పంటతోయిద్యలిని నేలె
నంతమేలిమిఁ దనపేర నపుడు నిపుడు
దంబుమీఁదెడు భరతవర్షం బనంగ. 12

క. జన్నములు పెక్కొనర్చియుఁ, బున్నమలమవసలురాగఁ బోడిమితోనా
వెన్నుని కిప్పన మంచును, బన్నుగఁ దానద్గ వేల్చు బత్తి దలిర్పన్. 13

వ. ఇట్లెన్నియేఁ బుడమిప్రజలు మెచ్చికొనఁ మంచిపను లొనర్చుచుండాఁ
గన్నకొడుకుకుట్టల కన్నం గారవంబునఁ బజల నరయుచు నిన్ని యన
రానివేలేండ్లు నేల నేలి తనమది లచ్చిమగనియందుఁ గలియఁ గూర్చి

కొడుకులకుఁ బుడమియెల్లఁ బంచి యిచ్చి లచ్చి కాటపట్టగునిల్లు
వాసి వాసి గలపెద్దల మాటఁ గొని పయనంబై పులహుం డనుజడదారి
నిలుచునడవికిం జనియె నదియును. 14

పులహాశ్రమవర్ణనము

క. నేల నగునెల్లకావల, లోలలిఁ గొనియాడఁ దీవెలోయలకోడల్
గోలముల కెల్ల నిల్లయి, చాలం జను నల్లకాన జడదారుల కై. 15

చ. కలుకున నేగ్గు లేనుఁగులగొంగలు గోరెక నాలు నాలదిం
గ్గలుకలు నెల్కఁ గొంటు లోకయింతయు లో నెడ లేక యందునన్
గలజడదారిరాయలకుఁ గల్గినతేజున నొక్కఁ గొంతు గా
నలరెడు నల్లకానఁ గొనియాడఁగ నౌ ననవాదు బమ్మకున్. 16

మ. నడికే దాఁ కలకానలోనఁ గడుఁ జెన్నారంగ జేజేనుడు
లక్కలచక్కిం జడదారిపుత్తురులు వల్కం గా నెడం గొంకులన్
ఉలి నెంతే నిదురించుచున్నయెడనైనం జాగరం బేగుదేఁ
జిలుక ల్గోరలు దిద్దు నున్నబులు జేజే లెన్నఁగా నొజ్జలై. 17

క. జడదారిరాయసెలల, క్కడ జన్నము లూని యునికిగా నుండుటచేఁ
గడుకొని ప్రామినుకులుగ, ల్గెడుతావనిపాగడఁగాఁదగెన్ జగమందున్. 18

తె. పొనర హరివాణముల నిల్పి పూజఁ జేయఁ
దగినఱా లెందు తండోపతండములుగ
నుండి యాడుచు నుండు నాగండకి యను
వాఁక యక్కానయం దొసిఁ బాఱుచుండు. 19

క. ఆపులహానినికేపట్టున, బాపనకేఱేండ్లఁ గూడి భరతుఁడు మదిలో
నీపగిది యంచు నడుపఁగ, నోపని కడుబత్తివెన్ను నుడుగక కొలుచున్.

వ. మఱియు నతం డన్నియుం బెడఁబాసి యొండేమి యెఱుంగక బత్తిం
దగిలి సంతసంబున మేను చెమరించి గగుర్పొడువ నల్లనయ్య నుల్లం
బునం దిడుకొని నేమంబున నిరాహారియై తబమ్ము గావించుచు ని
ట్లుండఁ గొన్నియేండ్లు కొక్కనాఁడు. 21

భరతుఁడు గండకిలో లేడిపిల్లఁ బట్టి పెంచుట

ఉ. గండకి నాఁగఁ బేరనను గ్రాలెడువాఁకకు నేగి యొక్కనాఁ
మెండగుబత్తి నాడి తనమేనియన ల్వడనాడి నీటిలోఁ
రెండుగడల్ ల్మునింగి యమరెం దొలిపల్కుల కెద్ది తొల్లియు
యొండగునట్టియక్కరము నొయ్యనఁ బల్కుచు నుండె నంతలోన్. 22

మ. పొనరం జూల్గొని నీరుమోయుచు నెలల్ నూడాలు గాఁ గుత్తుక
త్తనుచు న్మెట్టుచు నెట్టకేలకును నీ రానంగ నయ్యేటికిన్
జనుఁదెంచెం గడునాస జింకనవలా చాలంగ నోకాలుబెం
డను నో రెండఁగఁ జేయునట్టిదగతోడన్ రెండుజాల్ప్రొద్దునన్. 23

తే. వచ్చి డిగి నీరు ద్రావుచో నచ్చొటి కొక
యింతదవ్వుల మెకముల నేలుమేటి
పాటి యింతనరానట్టిపరిది మొగసి
బొబ్బరించె దెస ల్మాఱు మ్రోసికొనఁగ. 24

చ. అది చెవులందుఁ బెద్దపిడుగట్టు పడం గడు భీతు జెందియు
న్బెదరియు బెగ్గడిల్లియును నివ్వెఱపాటును జచ్చపాటునుం
గదిరియు నల్లలేడి వడి గాడుపుతండ్రిని ముట్ట లేచి యుం
గద గలుగంగ నేటిదరి గట్టుపయిం బడి చచ్చెఁ బాటునన్. 25

తే. ఇట్లు పడునట్టియదనున నిట్టిచెలికి
కడుపు దిగజారి పూవిలుకానియింటి
తోవ నీళులఁ బడి బిడ్డ చావకుండ
నాడె దయ్యముకూర్పున నట్టియెడల. 26

చ. భరతుఁడు కన్ను విచ్చి తనప్రక్కన నీళులఁ దేలియాడుచున్
జరిగెడులేడిపిల్ల కని సంతసము న్మనరుం దలిర్పఁగాఁ
బరుఁగునఁ బోయి పట్టుకొని బందుగు లెవ్వరు లేని దీని నే
నరసినఁ బున్నె మా ననుచు నప్పుడ తోకొని పోయె నుట్కకిన్. 27

క. తోడుకొనిపోయి మిక్కిలి
వేడుకతోఁ బాలు పోసి పెంచుచు దానిం
గూడి పెఱపనులు విడిచియు
నాడుకొనుచు నిలిచె భరతుఁ డదియే పనిగాన్. 28

శా. నీట న్మున్గుట సందె వార్చుట తటి న్నిర్వాపలో వేల్చుటల్
గూటంబుం బెడఁ బాపుఁ బున్నెపుగతల్ లో నెంచుట ల్గోతె నా
పాటింపం దగుమంచికర్జములునుం బ్రాల్మాలి పోకార్చె నా
నీటం బట్టినలేటిపిల్లకొఱకై నేమంపురాయం డొగిన్. 29

క. గారాబంబున నట్టులు
గోరికమెయిఁ బెంప లేడికూనయు నానాఁ
డేరికిని నింపు గూరెడు
తీరున మే నొప్పఁ బెఱిఁగెఁ దే జలరంగన్. 30

తే. కఱఁగి పోసినబంగారుకరణి దాని
నిగనిగలు వొల్చి నలుగడఁ దగులుకొనుచుఁ
గదియ వచ్చినమొల్లరకన్నుఁగవకుఁ
బోల మదెల్లను పచ్చ య న్వొలుపు గొలుపు. 31

ఉ. సోయగ మేర్పడ న్నిలిచి చూచుచు మేనుఁ గదల్పకున్న దోఁ
బాయక చెంతఁ జేరి కనువారును నిక్క మెఱుంగ లేక మేల్
చాయ నెసంగుసొన్నమున సల్పినదా సిది ముట్టియుం గనుం
దోయియు వేల్పురాఱవలతో నగు నంచుఁ దలంతు రెంతయున్. 32

ఆ. మూడుకాళ్ళ నిలిచి మో మటు మరలించి
వెనుకకాలిగొరిజ వెసఁ దగిల్చి
కన్నుఁ గోఁకికొనెడుకడునేర్పు గాంచినఁ
గనులపండు వగును గాదె పజకు. 33

ఆ. కోడెకాడు మిండగీడు నయినవాఁడు
సొగసుకత్తె తనదుసోయగంబుఁ

గనెడునప్డు దానికనుచూపునకుఁ జొక్క
కరణిఁ జొక్కు దానికనుల జగము. 34

వ. ఆగాచదబిసియు నిల్లారుముద్దుగ నన్నానాయిట్టిపిల్లఁ దనయునికి పట్టునం బెట్టుకొని యెడతెగనికనికరంబునఁ గూరుచుండెడునపుడును బండుకొనెడునెడను నీ రానెడునదునను బూలు బత్తిరిఁ బండ్లనం దెచ్చునజ్జునను వేల్పులం గొలుచుతఱిని దనయొద్దన నునుచుకొనుచుఁ బులి సింగం బెలుఁగు తోడే లేడిక లోనగునడవిమెకంబులవలనిబీతునఁ బొలంబుల వెనువెంటం దిరుగులాడుచుఁ గొంతదనుక బుజంబుల నెక్కించుకొని మోయుచు మఱికొంతసేపు తొడలమీఁదం గూరుచుండం బెట్టుకొని ముద్దులాడుచు నొక్కింతతడ వక్కునం జేర్చుకొని సంతసించుచు నదియ పనిగా నుండి నిచ్చలునుం జేయుచేఁత లందదుకులుగా నెడనెడ లేచి చూచుచుఁ బెక్కండ్లు బ్రదుకు మని దీవించుచు నంతలపొంతల దనక చెంతఁ జేర్చుకొని మిక్కిలి చెలిమిం చేసి యక్కజగండఁ బై యాఁకలంబులును దుంపతూండ్లును గడ్డికసరులును బాలునీళ్ళునుం బోసి పెంచుచుండె నట్లంటసిల్లి పెరుగుచున్న యాజింకపిల్ల యొక్కనాఁ డేరెకినిం గానరాకుండఁ గికురించి చొఁకళించి యెటయే నూడనింబాడె నంత నాతండు దానినెంతయేఁ దడ వబ్బాలాడుచు నెమకియుం గాన కక్కలిపడి తన్నుఁ బెఁబాసిపొకకు మిగులవగలం బొగులుచు దాని నెడఁదం దలంచుచు నిట్లని పలవించె.

భరతుఁడు లేడిపిల్లం గానక పరితపించుట

మ. అకటా! నాచిటిపాప! న న్విడిచి నీ వడ్డింతలే కేగితే
మెకమాటంబును బాసితే యడవి నేమోసంబును న్జెందితే
యొకలోయం బడి దారి తప్పితె మెకం బున్నట్టివో టంటితే
సెకలోఁ జొచ్చితె పచ్చిక ల్మెసవుచున్ జెర్లాడుచు న్నిల్చితే. 36

మ. తగ నీరానెడునప్డు బొబ్బమొక మొద్దన్ బొబ్బరింపంగ లో
వెగడుం జెంది కడింది మై నెగిఱి ని న్నే నీటిలో నూడ్చియుం

దిగటాకొం దరిగట్టుపూఁడఁ బడుట స్నీతల్లి తా నక్కటా
తెగి నీపాటులఁ జూడ దయ్యో నది నాదే బాద యయ్యొం గదే. 37

శా. నీటన్ బట్టెపుఁ డీవు చచ్చితివ యేని న్నేవుగా నాకు నీ
పాటుల్ కన్నొకయింతమూసికొని నేఁ బ్రాల్మాలి య ప్పుడటినే
నేటన్ వాలుగఁ బోయి తోపవు గదా యింతేని లో జాలి లే
కోటం చుంటిన యేనిఁ జేకొనుచు నిన్నోమం గదా బొట్టెరో. 38

క. ఎదవదలాడెడుమే స
య్యాదనునఁ బుట్టమునఁ మడిచి యఱకడఁ గొని నేఁ
బదిలముగ నిన్ను నాఁకుచు
గొదలంటక యరయుచుంట గోడయ్యొ ౘయా. 39

ఉ. కన్నులు ముక్కుమూసికొని కా ల్గదలింపక నేమ మంది నే
నున్నెడఁ జన్నికొమ్మకొన నొయ్యనఁ గోఁకుచు మేను నాఁకుచుం
గిన్నలు మోము మూరొకనుచుఁ గాళ్ళపయిం దల వెట్టి పండుచున్
న న్నెపు డెంటి యుండువీను నాతరిమే పెడఁబాసి యుండుటల్. 40

ఉ. లేరిచి రేకి కాటుకను దిద్దుచుముద్దియకన్నుఁదోయికిన్
మీరకు మీరాఁపోల్చుఁ గొని మించి తలిర్చెడు కిదుకన్గవన్
సారెకు వెన్కకాలిగోరిజం దగ గోఁకెడునేర్పు పెంపునన్
నారయను నెమ్మదిం దలఁపఁ జాల దిగుల్కొని కుంద కుందునే. 41

వ. అనుచు నక్కజం బగువిరాళి నెక్కొన నక్కలిపడి తుద కంబేదయై
మిగుల వగలం బలుకుచు మఱియును. 42

సీ. అలికి ముగ్గులునెట్టనల వేల్పుటరుఁగుపై
నెలమిఁ బన్నుండువా రెవ్వ రింక
నగ్గుల వేల్పంగ నమరించుతెల్లులే
యిగురులు గొరుకువా రెవ్వ రింక
సాములఁ బూజింప సంతరించినపూల
నెసఁగి మూరొకనెడువా రెవ్వ రింక

జేజేల దారుబు సేయింపఁ దెచ్చిన
యింపునీ రారువా రెవ్వ రింక

తే. నేలికకుఁ నారగింపు సేయింపక మును
బువ్వ బుక్కెడు మెక్కువా రెవ్వ రింక
నెపుడు నను ముద్దుగుడుపువా రెవ్వ రింక
నీవు విడనాడి పోయినయింతలోన. 43

ఉ. ఎక్కడ నుంటె నానినువ! యిక్కడ నాపని యేమి చేసి నీ
వెక్కడి కేగితివె మఱి యేమిగొందంబడి వేగుచుంటివే
పక్కనఁ బోయి కోలుపులివాచవి యైతివె నవ్వుటాలకే
చక్కన దాఁగియుండి కొనసాఁగితె లోఁగితె యేమి యైతివే. 44

తే. తల్లిదండ్రులు లేనట్టిపిల్ల యనుచుఁ
మిగులనక్కటికం బెదఁ దిగులఁ దగిలి
నడిచి మెకములదాడినిఁ బడఁగ నీక
పెంచునను విడనాడితే పెరిమ లేక. 45

తె. నాదుపెంపుడుకూన! న న్గా దటంచు
జెదరి పోయితె నే నేమి చేయువాఁడ
నెపులు గనుగొందు వెండి ని న్నిపులు వాసి
యొడలియుసురులు విడక యెట్లుందు వాఁడ. 46

వ. అని పలు దెఱంగులఁ బలవించుచు నతం డుల్లంబున మిగుల నారా
టంబు జెంది నేను దబమున నున్న యెడ నన్నుఁ గొమ్ముల గోఁకు
చుండునట్టిగొనంబు లే నెన్నఁడు గందునో? నే నించుక కసరినం గని
కొమరుండు బలె నెడఁ జని నిలిచి పిలిచిన మఱియు వచ్చి వెనుక నిలిచి
యుండునట్టిమెలఁకువలు గలదాని నెప్పుడు చూతునో? యది యెప్పుడు
వచ్చి నన్ను సంతసపఱచునో? లేడి త్రొక్కినచేల జన్నంబుల కగు
ననుటం జేసి యీతోఁట నెంతపున్నెముం చేసికొన్నవో? బాబిగ్గ యు

నేను నీతల్లిలేనిపిల్లం బెంచిచెదం బున్నాం బని వేగొంటి నట్టినే నిట్టియు
క్కట్టులఁబొంద వలసె నక్కటా! దయ్యమా! యని దానిపైఁ గలతమ
కంబునఁ జాల విరాళింపఁ మాలుచుఁ దనతబంబంతయుం జెడ జడనువడి
యుండె నంత నొక్కింతసేపున కాజింకబుడుత చనుదెంచి గాచతబిసి
కన్నుంగవకుం బొడకట్టుటయు నతండు పోయినసొమ్ము వెండియుం
జేకొన్నవానిం బలె మిగుల సంతసించుచు దానిం జేర నరిగి మోరం
బట్టి ముద్దుపెట్టుకొనుచు మేనెల్ల నిమురుచు సిరంబు మూరుకొనుచు
సందిటం జేర్చుకొని యిట్లనియె. 47

భరతుఁడు లేడిపిల్లను గాంచి సంతసించుట

మ. అకటా! నా చిటిపాప! నన్నిడిచి నీ వజ్ఞాడు చెచ్చోటికిన్
మొకమోటంబును బాసిపోయితివో యీప్రొద్దింతసే పీవు నా
మొకనుందోయికిఁ గానరామి నను వెంకో తల్లడింబంది మే
నికిఁ గాకుండఁగఁ బోవుచున్నదగుమి న్నోఁగి వేఁడా యిమ్మా ననున్. 48
మ. జలకం బాడఁగ లేమ సంజయును బెల్చ న్నార్వఁగా లేదు రే
పులు మాపుట్టఁగ వేల్వ లేము కరినేల్పు న్గొల్వఁగా లేదు నీ
ఖలును స్వాగ్రివఁగ లేదు నిద్దురదివి యెక్లొచూడఁగా లేదయో
యెలకూనా! నను వీడి నాడి యెటనో యీ వున్న యీయింతలోఁ.
ఆ. కంటఁ బడినవారిఁ గంటిరే నాబిడ్డ
ననుచు నడిగి యడిగి యడవు లెల్లఁ
దిరిగి తిరిగి యెంతొ నరయ నోపక పెల్లు
తల్లడిల్ల నైతి తల్లికాన. 50
క. నినుఁ గానమట్టి బెంగం, గొని యుల్లము తల్లడిల్ల గుండెలు వడకై
పెనుఱాయి దాపినట్టులు, కనవచ్చెన్ నాదులోనికము పోబిడ్డా. 51
ఆ. కంటఁ బడితి నాదుకడ తేఁటఁగా నున్న
యుసురు కుదుటఁ బడియె మిసిమిఁ గంటి

మంటి పసిఁడికోఁడె యింటఁ జేరెనయ్యెల్ల
లోఁ దలంచుచుంటి నాదుగూన 52

వ అని మిగుల వగలం బొగలుచుఁ దానంబును సంజయును దబంబును
లోనగునన్నియును విడిచి దారిద్ర్యోషం గూడిమాడి యుండెనని
శుకుండు వెండియును. 53

మ. తగులంబుల్ బెడబాపుఁ బున్నె మనుచున్ దా నాతఁ డల్లుడు బం
ధుగుల న్నెయ్యుర పిల్ల వాకిళులునుం దోరంపురాలచ్చియున్
దగునేల న్విడనాడి బోడి యగుచుం జాల్ అప్పలుం జెట్లు చే
మగముల్ గల్గినకాన మెట్టుచుఁ గటా! మా నీగెఁ గన్గొంటివే. 54

మ. ఇలు నిల్లాలును బుత్తురుల్ జగమునం దెవ్వారికి న్వొండి బా
ముల నెత్తెపఁ బునాదు లంచు విడీ యాబాతంబు బూతంబు నాఁ
దలఁప న్జేరెఁ లేడిపిల్లచెలిమిం బా జీంద్రమం దెంతయో
గలఁగె న్విటెవె? బమ్మవ్రాలు తుడువం గాఁ జాలునే యెవ్వఁడున్.

ఆ. ఎంతవారి కైన నేకమీఁడులకు నైన
వెన్నదొంగ కైన వేల్పుఁదబిసి
కైన నొసలివ్రాఁత కన్న లే దన్నవో
నెఱుఁగ మానిసు లన నొతసారు. 56

మ. ఏకమీఁడా! విను మంత నల్లభరతుం డేఁ ప్లన్నరమే న్గ్గి కా
నక వేగింపుచు నొక్కనాఁడు తనపుం జావుగి నొచొప్పు గొ
చక యేతెంచినజాడఁ గాంచి మదిలోఁ జాలంగ నారాట మొం
ది కడున్ జేరువ నున్నజింకబుడుతన్ దేర్పారఁగాఁ జూచుచుణ్. 57

తే. ఓసి! పసఁ గన్నబిడ్డ! నీ న్బాసి పోక
వచ్చెఁ దలమీఁద జేసంత వఱలు మిత్తి
చావు నిక్కంబు కటకటా! చేవ లేని
యీ విఁ కెట్టులు బ్రదికెదవే తలాప. 58

# ద్వితీయాశ్వాసము.

## భరతుఁడు లేడికడుపునం బుట్టి విచారించుట

మ. అని దానిం దలపోసి పోసి మదిలో నారాటముం హెచ్చ వి
చ్చినకన్నుంగవ నిక్కిఁ జూచికొనుచున్ జీకాకునుం జెంది చి
క్కనగాఁ గుత్తుక రోసఁ గగ్లై మొలఁగంగా గుబ్బు రోఁటింపఁ జ
ల్లని యొంటూర్పున నుండి కొంతవడి కెల్లం జెందె బెన్నిద్దురన్. 59

ఉ. కండెను గాజు వాఱెను మొగంబు కనుంగవ కంగులో యపం
గ్రిందికిఁ బోయె బానవలెఁ గ్రీఁగడు పయ్యెను మూయ రాక నోర్
కందక మయ్యె కానఁ బడెఁ గాళ్ళును చేతులుఁ గొయ్య లయ్యె మే
నందు గుమారుఁడు నా బిగిసె నాతనిలో నుసు రేగినంతటన్. 60

క. ఆరాచతబిసిపీనుఁగు, నారయ బీతెఱుఁగనట్టిదైన వడంపున్
గోరికఁ గని తనలోనం, జేరుచుకో నంటరానిజేజే కగునో. 61

వ. ఇట్లు పీనుంగై యతండు పడియుండినంత. 62

చ. ఉసురొదలి చ్చడిన్ విడిచి యుప్పరవీదికిఁ బోవునప్పు డా
నిసువును నెమ్మదిన్నిలిపి నెయ్యము పెంపున నుండెఁ గాన న
ప్పస చెడియున్న లేఁడు కడుఁగాఁబలపాలయి పోవ వెండియుం
గసవును మెక్క నిక్కియయి కప్పికిఁ బుట్టెను దొంటితెల్వితోన్. 63

చ. కడుపున నున్నయప్డు తనకాళ్ళును జేతులు మేనదల్ప రా
కడగొనఁ ద్రేవులుం బొరలు నంతటఁ జుట్టుకొనంగ కుళ్ళుపిట్టులోఁ
బడి కడు నెమ్మలో న్తె వెతపాలయి యుట్టినిసుంగు తెల్విమిం
గడువడి బమ్మరిల్లెఁ దనకర్జముచేఁతకుఁ దల్లడిల్లుచున్. 64

తే. తల్లికడుపున నున్నప్డు దారసిల్లు
వారి కాఁగొడ్డులోనుండి కారు మరుచు
నేడ్చునట్లును గటకటా యెంతవంత
యనెడునట్లును వినవచ్చు నచ్చెరువుగ. 65

చ. వెనుకటిబాములందుఁ గటిపేల్పును గొల్చినవాఁడు గాన నం
గున పెప్పు శిక్షయై పాడమి తోరపుఁదెల్విని బాపుకుండి లో

ననయము నట్టిబాము తన కప్పుడు కల్గుట కెంతయేనియుఁ
గనలుచుఁ బిమ్మటం బడుచుఁ గాఱియ నొందుచు నేడ్చుచుండెఁబో.

ఆ. తల్లి పాలుగుడుపఁ దారసించిన ముట్టె
పొదుగుచెంతఁ బెట్టి కొదుగుఁ గాని
కడుపు నిండఁ బాలు గుడువ నొల్లదు వెన్నుఁ
దలఁచు చొడలు మరచి నిలిచెఁ గాన. 67

మ. కడుపు ల్గట్టి కొలంబుసాములు గడున్ గారాబ నేపారఁ బెం
బొదలందు న్బొలమందు మెట్టుకొనుచుఁ బోవంగ నాజింక పెం
పు దలిర్ప న్నడయాడ దంటి కసవు న్మూర్కొదు కార్కొన్న పెం
ద్దది కొలుంబులి కాంద్రు కాంద్రు మని రాఁదాఁగాగిపో నెంచదున్.68

సీ. వడి మెట్ట దడు గెటఁ బడి చీమ చచ్చునో
యనుభీతునను బాలమండిసు నెప్పుడుఁ
గసవు మేయదు దాని కసురుగల్గదు నది
తలఁ ద్రెంప నెంత యేడ్చెడునొ యనుచుఁ
దెలిచి నీ రాన దేచిఱుచేప నోటిలోఁ
బడి నల్గునో యని వెడఁదవగను
జేలదరికిఁ బోదు రాలి యెన్నులగింజ
లలకాపరికిఁ జెడు గగు నటంచుఁ

తే. దనదుకతమున నేటి కె త్తటిని గొదలు
కలుఁగకుండఁగ నెండుటాఁకులును నెండు
గడ్డియను మేసి యిన్నినీ ళ్ళడ్డి త్రావి
బ్రదుకు నేవగించుచుఁ వనబాముస కది. 69

సీ. తెలనోటిమెకముల కిల వైనబలునీర
ముల కేగు నొకమాటు తలఁకు మాని
తనవారితోఁ గొండకొన కేగి తిరుగుచు
నుంకించి పడు క్రింద కొక్కమాఱు

పెనుదారి దారసించినవాఁకనడుమ నీఁ
దక యుండు నొకసారి తల ములుఁగఁగ
నడవి నల్లడల నేర్చెదుకార్చుచిచ్చులో
నొగిఁ జొచ్చి పొరలాడు నొక్కతేప

తే. తీఁగ కుత్తుక కుఱి గాఁగ నూఁగులాడు
నొక్కపరి పసరంబుమే నూడి పోవ
జింక యగునట్టిభరతుఁ డేవంకనైనఁ
జేటు వచ్చునె కుడు పెల్లఁ జెల్లకుండ. 70

క. ఇప్పగిదిఁ గొన్ని యేడులు, ముప్పిఱిఁగొన్నట్టివంత ములుఁగుచుఁదొలిబా
మప్పటితెలివిని నొకనాఁ, డొప్పుగఁ దనబాముగురిచి యుల్లమునందున్.

వ. మిగుల వగలం బొగలుచు ని ట్లని పలవింపం దొడంగె. 72

మ. దొర లెల్లన్ దొర వంచు మెచ్చుకొనఁ గాఁ దోరంపులచ్చిన్ జగం
బరయ న్వేల్పులఱేనితోడఁ బురుఁ డై యస్పండి పెన్నేలకున్
దొరలం జేసి కొమాళ్ళనుం దబుసు లేత్రోవం దగం జేరి రా
నిర వత్తోటగ నుండి రాతబిసినై యిల్లైతిఁ గా దయ్యమా. 73

క. జింకం బెంచినకతమున, గొంకక నాతబము నేటఁ గొట్టుకొనిచనెన్
బొంకక సెడి యిటు లైతిన, యింకిట నే నేమి యగుదు నెఱుగం గట్టా.

ఉ. ఏటికి నేటికే న్మనుఁగ నేగితి నేటికి నీట నుంటి నే
నేటికి లేటిపిల్లఁ గని యింపుగఁ బట్టితిఁ బుట్టె నంచు న
ప్లేటికిఁ బెంచినాఁడ మఱి యేటికె మాటకిఁ బ్రేముడింతు నిం
కేటికి నెవ్వగం బొగల నేదియుఁ దప్ప ద దెట్టిమేటికిన్. 75

వ. అని మఱియు నా కాలేడిపిల్లకతన నిట్టిబా మెత్తి బాములం బడఁ
గల్గె విడుపుపేరితానకంబు దూరం బయ్యెఁ గదా! యని యంగ
లార్చుచు నొక్కనాఁడు తన్నుఁ గన్నతల్లిం బాసి యొకచోఁడ తొల్లింటి
పులహున కొల్లగునల్లతోఁటకుం బోయి యం దామే నూడిపోవ

నుపము నెమకుచుఁ బున్నె మిచ్చు నచ్చం బగునాయేటినీటఁ గ్రుంకు
లిడుచు నిచ్చలుం బొడిచెడిప్రొద్దున కెట్టయెదుట సాఁగిలఁ బడి
మ్రొక్కుచు పాలుఁబండ్లు కొమ్ములకొనలం గ్రుచ్చి తెచ్చి జడదా
రులకడఁ బెట్టి కొలుచుచుఁ గొమ్ముకొనల వారిమేనికండూతిం
బాపుచు నుల్లంబున నెల్లవేల్పులకును మ్రొక్కులిడికొనుచుఁ గడు
నేమంబున నుండె నంత. 76

లేళ్ళ కుమ్ములాట

చ. అడవుల వేటకాఁడొకరుఁ డల్లికఁ బెంపుడుజింక కొమ్ములన్
వెడఁ దగిలించి వెంటఁ గొని వేటకు మెట్టుచు నిట్టునట్టునన్
జడనుపడ న్నడల్ దిరుగ సాఁగెడు నాభరతుండు నాఁగఁ బో
ల్చెడుచిరుజింకఁ జూచి తనజింకను బోనుపి కొల్పెఁ గొల్పనన్. 77

చ. అదియును గొమ్ములం గలుగునల్లికతో వడి నేగుదెంచి మో
మది యొకరోరఁ జేసికొని యక్కడ నేలనుఁ గాళ్ళ దువ్వుచున్
గొదుగక ముట్టె ముట్టెయుచుఁ గొల్పుగఁ గొమ్ములఁ గ్రుమ్ములాడి య
య్యదనున గొంతుగం బడఁగ నచ్చిఱుజింకనుఁ లాఁగె నీడ్చుచున్. 78

మ. పొగరుం జెందినవేఁటయిఱ్ఱి తనకొమ్ముంజిక్కుముం గుత్తుకన్
దగులం బెన్వడి నీడ్చుచుండెనుతఱిం దబ్బిబ్బునుం జెంది యా
బిగువుం దప్పినవెఱ్ఱియిఱ్ఱి పుడమి న్నీరంబునుం జేవ లే
క గుభుల్లంచును సద్దుగాఁ బడియె మే ల్గగ్గెం గదా యం చొగిన్. 79

మ. పడి దయ్యంబుఁ దలంచుచున్ దనకు మే న్వాయంగ నౌనజ్జ వ
చ్చెను నంచుం గడుసంతసించుచు మదిం జేడ్పాటు లే దా బళీ
కడగం ల్లొంకిటఁ దీఱె నేను విడుపుం గాను న్నరే మేలు మే
లడియాస ల్దగఁ బండఁ జేసె నిట నాహా! వెన్నుఁ డం చున్న దోన్. 80

ఉ. బట్టను చప్పుడు ల్వొడమ బొఁకులజోకగ నున్న ఱాలపై
జిఱ్ఱును బుస్సు మంచుఁ గడఁ జేవమెయిం గొని గంతుకొన్నయా

యిట్టి వడి న్వడి న్గడమి నీళ్ళచుఁ బోవుడు మేనినెత్తురుల్
జట్టని కాళ్ళు జారి పడులాగునఁ గాలువ గట్టె నయ్యెడన్. 81

ఆ. తొలుత మేనితోలు తుకతుకలై పోయెఁ
గారె నల్ల కండకండలుగను
బుడమి నెమ్ములెల్లఁ బొడిపొడియై రాలె
నిట్టి నిట్టి యీాడ్చు చేగుతజేని. 82

క. ఆయంగలార్చునంబడి, పాయక యున్నట్టజింక పలుతెఱగుల నా
నాయది యంతయు మేలని,యే యుండెను గాని వగవ దంతేని వదిన్

తే. ఇంచు కాత్రము పడినపై నెంతయేని
సుకము గలిగెడుననుమాట వొప్పు దెలసి
యెఱుకఁ గలిగినజింక లో నేల వగచు
మగనితో నగ్గిఁ బడుసతి వగచికొనునె. 84

వ. అట్లు చియ్యఁబట్టి కావరంబున నున్నగండుటిత్తి యీడ్చుకొని పోవం
బోవ ముంగఱ గండకిరేఱు దారిఁ దారసించినం గని యాజింకతేఁ
డాయేఱు పున్నె మిచ్చుం దాన ముకితి గందు నని గిజగిజం గింజు
కొని తన్నుకొనుచుం బెనుఁగులాఁడి నీటం బడి కొట్టుకొనుచు నసు
వులం బాసె నప్పు డావేటకాఁ డరుగుదెంచి యుచ్చు విచ్చి నేలంబడి
పొరలాడుటం బాడుపడ పనికిమాలినయాబొందె నందునన విడ
నాడి యెటయేనియుం బోయె ననినఁ బుడమిఱేఁడు చదిసిజేనిం జూచి
యి ట్లనియె. 85

మ. జడదారీ! భరతుండు జింకయెుపలిం జాలించి తర్వాత న
వ్విడుపుంబేరిఁటితాన మందెనో కడు న్వినాళమ్ము బాపుని
వ్పుడమి న్పొండియుఁ బుట్టెనో తెలుపుమీా పోలించి నే నాలకిం
చెడు నిచ్చుం దగి యుంటి నాఁగ ననియెం జెన్నారఁగా నాతఁడున్.

క. పుడమిదొరా! పెకపుటొడల్
విడనాడి యతండు ముగితి వెలుఁగక మఱియున్

బుడమిం బాఱుకోలంబునఁ
బడి కదుఁ బడరానిపాట్లు పడియె న్వృషమా. 87

ఆంగిరసుఁడను బ్రాహ్మణుని వృత్తాంతము

తే. మున్ను కలఁ డాంగిరసుఁ డనుపుడమివేల్పు
వేల్పులను జన్నముల మెక్కఁ బెట్టిపెట్టి
మేటి సోమాసి యగఁ దొలిపున్కగముల
నరసి తప మొనరించెడువట్టివాఁడు. 88

సీ. నడికేయి యగుదాక విడువక చట్టాల
వల్లె వేయించి ప్రాఁబలుకు వెల్ల
వెన్నునిఁ దలపోసి వెడనిష్టురం జేసి
వేఁకువజామున వేగి లేచి
పదివేసములసామి మదిలోనఁ దలఁచి య
త్రాజీఁ గర్జములు దీర్చి తగినమాడ్కి
నిసుఁగులతోఁ గూడి నెఱనిూటి నేటికిన్
జని యందు నీరాడి సందె వార్చి

తే. తొలిమినుకుతల్లి నెదలోనఁ దలఁచి తలఁచి
వెన్ను వలకన్ను నేటికోల్కన్ని చేసి
యింటి కరుదెంచి యగ్గుల నెఱిగి వేల్చి
యాంగిరసుఁ డిట్లు నిచ్చ లెసంగుచుండు 89

క. ఇచ్చింపుగోసంబులచే, నిచ్చలు బజ లెల్ల మెచ్చ నెమ్మి మేయిం దే
జమ్మ్పడనతఁడు మెలఁగెడు, నిచ్చలవిడిఁదిరుఁగ మదిఁ విడువక కడిమిన్.

తే. అతని కిద్దఱు పెండ్లము లందుఁ బెద్ద
గరితయంచును దొమ్మంద్రఁ బరఁగుఁగొడుకు
కుఱ్ఱలును జన్నసకియందు కూఁతు నొకతెఁ
గాంచి పుడమిఁ గాపుర మొనరించు నతఁడు. 91

వ. ఇట్లాజన్నిగట్టు కాపురంబు సేయుచు [illegible]. 92

మ. బరువై తోఁచినజింకపేను విడి శాపంబైనతి వ్రాతనే
పరికింపం గడతేఱు బాము లనుచుం బాటించి లో నెంచి యా
భరతుం డంతటఁ బున్నియంపుగనియై పొంగొందుచున్నట్టియాం
గిరసుం గూడినచిన్నచేడెకడు పన్నుల్ప్రొట్టలోఁ జేరెఁ గా. 93

చ. కడుపున నున్నయప్పు తనకిగ్గినబామునుగఁ గూర్చి యొంతయే
నడలుచు దేవరా! యనుచు నాత్రముఁ జెందుచుఁ దొల్లి తా నొగిన్
వెడఁ గయి చేసినట్టి పదివేలకు మించిన చెట్టచేఁతలం
దడవుచుఁ దిట్టుకొంచుఁ దనుఁ దా నిసి యుం చతఁ డుండె నయ్యెడన్.

ఆ. జడనుపడినబుద్ధి గలిగినకొమరుండు
కడుపులోనఁ జొచ్చి కడఁగుఁ గాన
నంచనడలచెలియ కాతఁడె నొంతయు
నడలు జడనువడియె నాఁడునాఁట. 95

క. తెలివి యనుదివ్వెతేటన, వెలుఁగొందెడుకొడుకు లోన వెలసినకతనన్
నెలఁతకు నొడలయ్యెడలం, దళదళ మనుజోతి నలరెఁ దగఁ బరికింపన్.

క. సడుపడు డాబిలిఁ బట్టు, న్నెడలెడునో యనెడు వెడఁద వెలుపుఁ బోలెన్
గడుకొనియారేర్పడఁ, బ్బొడు వెలవెలఁ బారె మోముపొలఁతికిమిగులన్.

తే. నెలఁదిమిన్నపాలిండ్లకుఁ బిరుదులకును
నడుమ నుండి లేదన నొప్పు నడుము మిగులఁ
బ్రబలెఁ గలవారినిర్వురఁ బట్టి నెవరు
వడసి చనుబీద జగముపఁ బ్రబలు టరుదె. 98

మ. కలదో లేదో యటన్న సందియమునన్ గన్పట్టు లేఁగౌను మి
క్కిలియై తోఁచెను జన్మనల్ గఱిగిం గేరు న్నడ ల్విన్ననై
యలరె న్నొమ్మది వెల్లనయ్యె మెఱుఁగై యాపొప్పె మ న్మొక్కటల్
గలిగె న్మాత్రికి నూర్పు లగ్గలమ్మునై కాన్పించె న ప్పంటికిన్. 99

ఆ. రేవఁ గూర్చుచున్న లేపనీనట్టాలు
పెరుగు చున్నయట్టిపెద్దకడుపు
చెలఁగ మోసి మోసి నెలలు తొమ్మిది గాఁగఁ
గనియెఁ గొడుకుకుఱ్ఱఁ గలికిమిన్న. 100

బ్రాహ్మణజన్మము

చ. నెఱి లగనంబునం బొడమి నిద్దఁపుజోతిని వెల్గుచున్నయ
చ్చిఱుతను మంత్రసాని తనచేసురియం బగ బొడ్డుగోసి పో
గరితలు లాల వోసి వెనుకం బొడితోఁ బొగ వేసి యుయ్యెలన్
బఱచిన మెత్తల న్నిలిపి పాటలు దీటుగఁ బాడి రూఁచుచున్. 101

చ. పురికొని ఱమ్మురంచు నొకపు ర్వది యెన్నెము వచ్చి చెక్కిళుల్
కరకఱి నొక్క చంపకొనుఁ గందు నటంచు వెర న్మఱి న్మఱిన్
బఱపుచు నల్లుచెట్టుకత బొపనికూఁతురు మాలపెండ్ల మం
చరగడె కర్వదాఱుపరు లాడుచు నుంద్రు నెలంత లప్పటిన్. 102

ఆ. గాలి దూలి సోకి కందు సెషక యుండఁ
జల్లి బూది వేళ్ళ వెల్లసులును
నూఱి పొగలు వేసి నోములు నోపించి
పురిటినాళ్ళు పదియుఁ బోకడంచి. 103

కం. మఱిబారసాల నొనరిచి, భరతుం డని పేరుపెట్టి బంగరువుచ నాం
గిరసుండు పాలు పెదవులఁ,బరఁగం దగులించెఁ దానుబంఁడతుకతోడన్.

వ. మఱియునం గలపండువులెల్లఁ గావించుచుఁ దల్లిదండ్రులు దమబందు
గులపిండుతో మొదుకొనుసంతసంబున నిండుకొని యుండి రంత.105

శా. కన్ను ల్విచ్చి కనందు గిల్లు లిడినం గార్కొ ర్మనం దుగ్గునుం
జన్నుంబా లిడఁ బోవ నావనఁ దగి న్గాల్సేతు లాడింపఁ దే
సన్న ల్చూపిన నవ్వఁ జెప్పఁ దను నాచందంబునం బండు లో
వెన్నుం జూచుచు నుండెఁ గానఁ గడుతెల్విం బుట్టునప్పట్టియున్.106

చ. నిసువును గాలి సోకె నని నేర్పునఁ జేతుల రచ్చఁ గట్టియున్
బసుపము మేనఁ జల్లియును మందులు ద్రాఁకులు నూఱి పోసియున్
విసువక వేయురానియవి వేలను జేసియుఁ దల్లిదండ్రు ల
ద్దెస వితమైనవారయిరి దేవరచెయ్వుల కబ్బ ముందునే. 107

వ. ఇట్లుండియు నబ్బుడుతం డేట్లేట యొక్కచందంబునం బెరిగి పెద్దవాఁడై.

బాల్య వర్ణ న ము

సీ. విద్దెంబు లొనరించుఁ బ్రొద్దుకంటెని నిల్చి
కొలుచుట లనుచును దలఁచుకొనుచు
దప్పటడుగులు వేయుఁ దరిగట్టువారికి
వలఁగొన టలు నాకుఁ గలిగె ననుచు
నత్త తాత యటంచు నాడు నల్లనివేల్పుఁ
గైవార మొనరించుకరణి యనుచు
బొమ్మలఁ గొనియాడుఁ గమ్మవిల్తునితండ్రి
కగురూపు లన్ని చేఁ దగిలె ననుచు

తే. అతని నెప్పుడుఁ దలఁచుచు నతనియందె
తనదునెమ్మది యంతయుఁ దగులుకొలిపి
తెలివి గలుగుటఁ దొంటిబాములను దెలిసి
బీతుఁ గొను బత్తుఁ డగుఁ గానఁ బెరిమ నతఁడు. 109

క. తల్లీ! యని దండ్రీ! యని, తెల్లముగాఁ బిలుచు వారిఁ దేలింపంగా
నుల్లంబున జగములకని,యల్లనఁ దొలిదొల్తననుచు నాభరతుఁడాగెన్.

ఆ. సంగడింద్లు చిఱుత లంగడి నాటల
నాడఁ బిలువ నాతఁ డాడ నిలక
నక్కటకట వీర లడుగునఁ బురువుల
నలఁగఁ ద్రొక్కుదు గని తొలఁగి పోవు. 111

ఆ. ఓనమాలు తండ్రి యొయ్యన వ్రాయింప
నొజ్జకడను జదువ నంప నతఁడు

జడనువడినవానిచందంబుఁ దోఁపఁగఁ
జదువఁ డన్ని తొల్లి జతన మగుట. 112

వ. మఱియు నిట్లు పిచ్చియుఁ జెవుడును మూఁగయుం గ్రుడ్డియుం గలిగి జడనువడినవానిమాదిరిం జూపుచు జడభరతుం డనియెడు బిరుదు పేరుం గాంచి కించుసంచునఁబెద్దమొప్పు మొఱడు తెఱంగున నున్నను గన్నవాఁడు గాన నాంగిరసుండు ప్రేముడిం బెంచుచు జన్నిగట్టులకాం జేయనగునట్టిచేఁత లన్నియు వరుసతోడ నడపించి వడుగుం జేసి నడవడికలనేర్పు గదుర విద్దెలం గఱపుచువచ్చిన నిచ్చలే నుండియుం దండ్రియానతి నన్నియుం గఱచి కైకొని యతండు విను నట్లు తల తోడం గూడినతొలిమినుకులతల్లి నేమంబున నుడువుచుఁ దొల్లి వచ్చినవాఁ డైన మఱియుఁ దొల్లింటిపలుకుల వల్లెవేయుచు నన్నల వేల్పుచు వేల్పులం గొల్చుచుఁ దల్లిదండ్రుల సంతసవెల్లిం దేల్చు చుండె ననిన విని తరువాత కత చెప్పు మని జనదారులు సూతు నడుగుటయును. 113

ఆశ్వాసాంతము

మ. ఎటఁ జూడం దనపేరు తేజ ననమే యింపొందున ల్లించి య
క్కటికం బేర్పడఁ బేదలన్ మనుచు చుం గావించు చుం గోర్కు లెం
తటికైనం దగి నేల నేలఁ గడుజాణం డైనమూరావువేం
కటసూర్యుండు పిఠాపురంబుదొర వేడ్కం దేలి మే లందుతన్. 114

గద్యము.

ఇది శ్రీ మహామహోపాధ్యాయ, కలాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబయిన బ్రహ్మానంద మను
నచ్చతెలుఁగు ప్రబంధంబున
ద్వితీయాశ్వాసము

---

# బ్రహ్మానందము

## తృతీయాశ్వాసము.



క. సిరి గలరావుకొలంబున, గరగరికం బొడమిపుడమికలికికి దొరయై
పరఁగుకుమారమహీపతి,కరమరు దగుపేర్మితో జగంబునఁ దనరున్. 1

వ. ఆలకింపు మవ్వలికత శుకుండు పరీక్షితునకుం జెప్పినట్లు సూతుండు
జడదారుల కిట్లని చెప్పం దొడంగె. 2

మ. వెడఁ గయ్యు న్నవుడు గైనపిమ్మటఁ గడున్ విన్నాణ మావిద్దెలున్
నడవళ్లుం డగ నేర్చి యట్లు తమకుం గాటంబుగా సంతసం
బడరింపం దలిదండ్రు లక్కొడుకునం దల్లప్పు చాలంగఁ బ్రే
ముడి తొట్టింపఁగ నుండి రింటిపను లాముంబుత్తురు ల్దీర్పఁగన్. 3

ఆ. ఇటులు కొన్నినాళ్లు లెసక మెసఁగ నాంగి
రసుఁడు నతనిసకియు నసము మీఱఁ
గన్నకొడుకు లూడిగము సేయ నుండియు
నునికిఁ బాసి చనిరి యొక్కనాఁడు. 4

భరతుఁడు విరాగియై యింటిపనులను తీర్చుట

వ. ఇట్లు కన్నవా రడవుల కరిఁగినవెనుక నిల్లు చక్కఁ బెట్టుకొనుచున్న
సవతితల్లికొడుకు లెల్లరు నీసున నాభరతుని విద్దెలం జదువ నీయక
యింటిపనులయందు నిలుపుటయు నతఁ డెప్పటిం యట్ల వెంబరవిత్తు
వలె నై మెలంగుచుఁ దమవారు చెప్పినవియెల్ల నేమరక చేయుచు
నిలుఁ దీర్చుచుండె నప్పుడు. 5

సీ. వేఁగునప్పుడు లేచి బాగుగ నిల్లు వాఁ
కిళ్లు వీదులు నూడ్చి నీళ్ళు చల్లి

యరుఁగులు గుమ్మము లఱలు నుద్దికిఁ బెండ
నలికి మ్రుగ్గులు పెట్టి పొలుపు మీఱ
బోలెలు చెంబలు ముంతలు వెలిచియు
నిల్లువట్టినపాచినీళ్ళు మోసి
మడిదోవతు లుదికి పడినన్ని మడినీళ్లు
వడసి యెల్లరకును వంటఁ జేసి
తే. వెనుక నెంగిళు లెత్తి బల్పేడఁ జేసి
వడ్లు దంచి పిండి విసిరి పప్పు చేసి
సంజదివ్వెలపనిఁ దీర్చి సరగ వండి
యాడపనులు చేయు గెడప కతఁడు గడఁగి. 6
సీ. దొడ్డుకలపా ల్పిండి తోడి మేపుకొని వచ్చి
పుల్లెలు గుట్టి గొడ్లల్ల వంట
కట్టెలు గొట్టి నాగలి దున్ని గుద్దలిఁ
ద్రవ్వి పొలము దొడ్డిఁ దనరఁ జేసి
కూరగాయలచెట్లు గొలిపి గనిమ లెల్ల
మునుఁగ నీటను జేతిమోట లాఁగి
చేలఁ గలుపుఁ దీసి నాలుగుపెడలను
వెలుఁగు చక్కఁగఁ బెట్టి పిట్ట గాఁచి
తే. తను బవలు రేయి గడి యేని గునుక కిల్లు
పొలము నరసి కాపాడుచు మొనసి యన్ని
పనులు నన్నలయూనతిఁ బాటుపడుచు
నలుపు నిచ్చలు రెక్కసిచంద మమర. 7
వ. ఇట్లతం డెడతెగక యింటిపనులయందు మెలంగుచుఁ చేతకానిరెండు కాళ్ళపసరంబు లగువారిచేఁ బిచ్చివాఁడు వెఱ్ఱివాఁడు గ్రుడ్డివాఁడు జడ్డివాఁడు నని పిలువం బడుచు నందులకుం దగినపలుకులం బలు

కుచు మంచిచెడ్డ లగుతినుబడుల నాలికకు సరిచవులఁ దలంచి మెస
వుచు నెందున నించుక ప్రేముడి సేయక మెలంగుచు లోపల నెప
తెగనిసంతసంబున వెలుపలి వన్నియుం బనికిమాలిని వని తెగడుచు
నేను నాయది యనునది చెందక యెండకు వాన కివమునకు నోడి
పైఁ జీర గప్పక గొప్పయెద్దుబలె బలిసియు మెత్తని గానిమేను గలిగి
నేలం బండి దుమ్మునం గప్పఁబడినమంచిమానికంబు పోలికం గను
బడనిబమ్మ తేజు గలవాఁడై మైలచింపి మొలం జుట్టి మసిపాత లగు
జన్నిదంబులఁ దాల్చి జడునుపడినవానివలె నుండి తమవారు పొలము
పనులయం దుంచిన నందు గీడుమేళ్ళు హెచ్చుకుందు లెఱుంగ
కుండి యుముక తవుడు తెలికపిండి పొట్టు నిప్పటి మాడు డబ్బెడ
లోనుగాఁ గలయవి జేజేలబువ్వపగిదిం దలంచి కుడుచుచు నిలిచి
యుండె నట్టియెడ. 8

చ. అడవిపొలంబునందుఁ దమయన్నలపంపున జొన్నచేను తా
నెడపక పిట్టఁ గాచి పవ లింటిపను ల్నెఱవేర్పఁ బోయి రే
నడి యగునప్డు వెండియుఁ గన న్మెయిఁ జింపియు లేక మోడులా
గడరెడు మంచునందు సని నారయవచ్చుచు నుండు నిచ్చటక్. 9

వ. అప్పు డొకనాఁటిరేయి. 10

భరతుని దుష్టజంతువులు హింసింపఁ బోవుట

మ. ఒకచో బెబ్బులి డాఁగియుండి వడిగా నొక్కంజమై వచ్చి వా
నికి వెన్కం జెయి ట్టి యీడ్చుకొనుచున్ రెం డంగ వేయంగఁ బో
యి కడుం గాలినయుక్కుతుండుబలెనై యింపొందుమైచేవ నా
గక కోఅల్ వడి రాలఁ గూలఁబడి వెన్కం జచ్చెనో నాఁ దగెన్.11

తే. కట్టెలకు నేగ నడవిలోఁ గాఱుటేన్గు
వడిగఁ జనుదెంచి పడఁదొబ్బి యడుగున నొక
కాలు ద్రొక్కి తొండమునఁ బైకాలు వట్టి
యతనిఁ జీల్పఁ బోఁ దెగెఁ దొండ మడరుబలిమి. 12

ఆ. కాటిఁదున్న తనదుకోరకొమ్ములఁ గానఁ
దిరుగువానిమేను దెఱలఁ బొడిచి
చెవులపిల్లి యనుచుఁ జెప్పంగ నగుచున్న
బోడి దయ్యె వాఁడి పోడుము లజి. 13

ఆ. కారుకోన నొక్క-కాఱుబెలుఁగు వానిఁ
గాంచి బొబొబొ యంచుఁ గలియఁ బడఁగి
వచ్చి బమ్మతేజు చిచ్చు నాఁ దోఁపఁగి
వెఱచి పఱచె వెనుక వెనుక దారి. 14

క. త్రాఁ చొకఁడు వానిమీఁగా, లేచినపగఁ గఱచి కోఱలెల్లం ద్రుల్లన్
వేచట్టు నడిన కైవడిఁ, దోఁచె స్తనలోనియుసురు తొలఁగినదానన్.

వ. ఇట్లు దయ్యంబుచెయ్వి పెంపున నేయడవిమెకంబులనున్ జడియక
తొల్లింటిజొన్నచేను రేఁబవలు విడువక కావలియుండునెడ నొక్క-
నాఁడు. 16

భరతుని సత్తికి బలి యియ్యఁబోవుట

ఆ. కలఁడు వీటియందు బలిజకొలంబున
కొడయఁ డటఁ బటేలు వడి గలాఁడు
సిరులఁ జాల జెంది చెలఁగువాఁ డెప్పుడు
పాడిపంటఁ గలిఁగి ప్రబలునొకఁడు. 17

ఉ. ప్రోలిపటే లతండుఁ గడుపోడిమిమై సిరు లంది యుండియుం
జాలఁగ బిడ్డలం బడయఁ జాలమి నొవలవంత గుందుచున్
వేలుపు లడ్డుపెట్టి రట వేయగుచేతుల సత్తిఁ గొల్చినన్
మే లగు నంచు నూరికడ మించినకోవెల కొక్క-రాతిరిన్. 18

క. చని నేమంబున సత్తిం, గొనకొని పూజించి తనకుఁ గొడుకుల నిమ్మం
చని వేఁడిననెనాయమ,యునుబడసెదుమానిసిబొలియొసఁగుదు వేనిన్.

ఉ. ఆపలు కాలకించి మదియం దపు డెంతయు సంతసించి య
క్కాఁపుకొలంబువాఁడు తనకావలివారలఁ బిల్చి యెక్క-డే

నోఁపెకతోడుత న్నెమకి యొక్కనిఁ దోడ్కొని రం డొకింతలో
నే పరికించి మీరు, బాలి యిచ్చెద సత్తికి నేను వేఁడుకన్. 20

క. అని యాస పెట్ట వారలు
పనివిని యొక వోట నొక్కబలుమానిసినిం
గని కొనిపోయెడుతఱి న
య్యనదలఁ గికురించి పఱచె నాతఁడు కడిమిన్. 21

క. వా రారేఁ గొట్టిపోఁ, బాఱెడునాతనిని నెమకి పడయఁగ లే కా
సూరునిబీతునఁ దిరుగుచు,నారసి రొక వోటఁ బాలమునం డాభరతున్.

ఆ. అరసి పట్టి యతని నయ్యారె! యీబాప
నయ్య చియ్యఁ బట్టి యలరు పీనిఁ
జూచి సంతసించుఁ జూ మనయొడయఁడు
నొడలినల్ల సత్తికడుపు నిండు. 23

వ. అని కులుకుచుం దఱిమి తోడుకొని పోయి తమయేలికకుం బొడ
సూపిన నతం డింతింతనరానిసంతసంబునంబొందెనంత నతనిబంటు లతని
కిం దలయంటిపోసి పసపుపూసి క్రొత్తపుట్టంబులు గట్ట నిచ్చి మేన
గందం బలంది పూలదండలు మెడనిండ వైచి నగలు పెట్టి మంచి
బువ్వం బారగింపం బెట్టి తమలంబుఁ జేయించి మంచియగరుసంపగి
యత్తరుతావి గుబులుకొనం జేసి పెద్దవాయిదంబులతో నూరేగిం
చుచు దేవళంబునకుం దోడుకొని పోయి యెదుటం గూరుచుండం
బెట్టి రపు డక్కడఁపువాఁ డాముగమానిసినెత్తుట సత్తి నలరింపం
దలంచి మంతరంబులు చదువుచుఁ దనచేతికత్తిం దూసి జళిపించుచుం
దల ద్రెవ్వనేయ నుంకించె నంత. 24

భరతుఁడు పనలో సంతసించుట

చ. తనతలఁ ద్రెవ్వఁ జేయు నని తా నపు డెంచియు నించుకేని బీ
తినొనఁగి యెట్టిదో యెఱుఁగ కాభరతుం డెద సంతసించుచున్

గినలకి వారలం దనదుగారవపుంజెలు ల్ట్ర తెంచుచుం
గనుంగివ మూసికొంచు మదం గగ్గొనుచుం డెం గడంక వెన్కనిన్. 25

వ. అంత నాం ఉలమ్మయు నెల్లయనులదాల్పులయందును వేరంబు లేక చెలిమిం గాపుదు బమ్మం గనునాపుడమివేల్పుతేజం జూచి నరిది యైనం దనకెట్టుపోయి యెట్టు వచ్చునో యని భీతుండ గడగడవడంకుచు నతని నెడంజేసి మిగులనీనున హాలమ్మనుచు నొక్కకేక వైచి చెడుగుపై పాఱునిం జంపునానాలవజాతి వానిని వానివానినిం బిలువం జేరులే కుండు నట్లు జంపి తినుచు నాటలాడుచుండె నని వెండియు. 26

చ. ఒరులసిరుల్ చెడం గొనియు నొల్లకుం గొనరించుచుం గరం బరయక బొంకులాడియును నాత్రముం జెందెడువారి దూఱియున్ గరకఱి యైనవాండు సిరి గాక తనంతన వేంగి చచ్చెడున్ దొరం గొనివానివంగడమునుం జెడి బ్రమ్గగు నిక్క మింతయున్. 27

క. ఒకరికి నెపు డె గ్గొనరింపక తనత్రోవం దనుజనువాం డేగొద లం టకసిరులందులందూగుచు,నుకమునినూ తేంప్లబ్రతుకుసొంపుదలిర్పన్.

వ. ఇందుల కక్కాఁపుతేఁడును భరతుండును దార్కాణం బని మఱియును.

ఉ. అత్తఱి నేలవేల్పు మదియం దట బీ తొకయింత లేక వే కుత్తుకం గోయ వచ్చి తను గుంజెడువారలయందు నత్తియం దొత్తెడుం త్తియందుం గడునొప్పెడువెన్నునిరూపు నిల్పి లో హత్తియ యుండుం గాని యినుమతయు నాత్రముం జెందం డెయ్యగే.

వ. అంత నప్పాఱుండు గుడివెలువడి పోయి క్రమ్మఱం దొల్లింటిజొన్న చేను గాయుచునుండె నట్టియెడం గొన్నినాళులు గడచినవెనుక యొక్కనాం డొక్కపుడమితేఁడు కపిలునిపలన నేను దానైతి నను తెలివి గలిగించుకొనునాసం బల్లకి యెక్కి యతనికడకుం బోవుచుండ మోంతెగాంప్రపు తమయుం దొక్కరుండ తెవులుగొంజై డువం జాల కంటం జెలిసి చేనికడ నున్న భరతునిం బట్టికొని పోయి వీనిచే

మోయింత మని పట్టి మూపునం బల్లకీదండి వెట్టి తోలి నడపించి
రట్టి యెడ నతండును దనయోపినకొలందిమోయుచు నడువ నప్పల్లకిం
దనకు మిగుల గుదులుపు దగులుటంజేసి పుడమిఁ జేఁడును. 31

క. కుదుపున నటు నిల్వ కదలుచుఁ
దుది కందుం బోర్లఁ బడియుఁ దొడిబడి మఱియుం
బదిలముగ లేచి వెండియు
గుదుపున్ సైఁపంగ లేమిఁ గుతిలం బడుచున్. 32

వ. బోయలం జేరి యిట్లనియె. 33

చ. ఉడుగుడి బెస్తలార వడ యుల్లమునం దళు కింతయేని లే
కడుగున మిట్టపల్లముల నారయ కట్టలు మీరు బిట్టుమై
నడచుట మేనికిం గుదుపు నాటెడు నెంతయు నిందు నిల్వఁగా
గడగడలాడుచుంటి నిట్లు కల్గుట కేమికతంబు చెప్పుఁడి. 34

వ. అనుటయు నాబోయ లిట్లని రయ్యా యియ్యది మావలన నైనది
కా దీనాలవవాఁడు మంచిగ మోయ నేరఁడు గావున మేమును నీత
నిట్లఁ నాటివారము కావలసి వచ్చె నని వం బుడమిఁ జేఁడు పెద్దలఁ
గొలిచినవాఁ డయ్యును నాగనికినకం గనకనలాడుచు నెఱుకఁ దప్పిన
వాఁడై నీకు గిప్పినదిప్పువలె నెట్టుంగ రానిబమ్మ తేజన నొప్పు నా
శాపినయ్యా గని కటకటంబడుచు పలంబు గా నిట్లనియె. 35

పటేలు భటతుని జెంపనాడుట

చ. ముదుసలివాఁడ వీవు కనుబొమ్మలవెంట్రుక లెల్లఁ బండె మై
వదవదలాడుచుండె నిట్లు పల్లకి మోయుట దప్పి తాఁకటన్
బొందలెద వెట్టు కాళ్లుదువ్వి పో నిను నిందులఁ బెట్టి మేము మో
యుదు మిఁక నిల్వవోయి యనుచు నొయ్యన మేలములాడఁ జొచ్చినన్.

క. విని వినయిట్లు పాటుఁడు
కనలక మారాడ కట్లు కనుమోడిచి తాఁ

దనదారి నడచుఁ బల్లకి
తనమూఁపున నొరసి మిగుల తబ్బిబ్బిడఁగన్. 37

వ. అంత నాబాపనరతనంబు తనకుం గడపటిది యగునాబామునందు నేను నాయది వీఁడు నావాఁడు వాఁడు నాసూఁడు ననునవి విడిచి యచ్చంపు తెలివి మెయి నా బమ్మం గనుచు మాటాడనినేమంబున నారాయనిపల్లకి మోయుచు నడచుచున్న వెనుకటివలెఁ గుదుపు గదురు టుడుగకునికింజేసి యీాసున నతండు వెండియు ని ట్లనియె. 38

ఉ. చావఁగ మోఁదెదం బ్రదికి చచ్చినయట్టివెడంగుబోయ నీ
కావర మిట్టులుండినది గా తగు నాదగునాన మీాఱి పో
నీ విటు తప్పుగా నడతు నీచెడుపోఁకలు మాన్పి మంచిగాఁ
బోవఁగ జేయువాఁడ నని మోటుతనంబునఁ బల్కె నల్కమై. 39

వ. అట్లు రాయండ ననుగరువంబున గ్రుడ్డివాఁడై మూఁడుచెడుగొంబులఁ బెఱుఁగుచున్నయతనిచెడ్డమాట లాలకించియుఁ గడునోపిక గలిగి తెలివిచూపున వెలుఁగుచు నిద్దంపుబమ్మరూపై యెల్లబూతంబులలోన నున్నవాఁడు తానయై యున్నయన్నెలవేల్పు త న్నెఱుంగక కాఱు లఱచుచున్నయాతేనిం జూచి యి ట్లనియె. 40

ఆ. పుడమిఱేఁడ నీవు నుడివినదంతియు
నిక్కవం బెడంద నిలిపి చూడ
నెట్టిబరువు లైన నీమేనికే గాని
నాకుఁ గలుగ నేర వాకళింపు. 41

వ. మఱియు లావుసన్నంబులు సుకము తెవులులు ముదిమిచావు లీను పంతసంబులు నిదురమేలుకొలుపులు నేను నాది యనుటలు లోనగు నన్నియు మేనితోడం బుట్టు దానితోడన పోవుఁ గాని నాకుఁ గలుగ నేరవు నేన కా దీజగ మంతయుం బ్రదికి చచ్చెడునట్టియదియే గావున నన్ను వేఱె యనం బనిలేదు. ఇతండోడయం డీతండు బం టనునది

పలుతెఱఁగులపనులవలనంజేసి మేనులకుం గలుఁగుఁ గాని యుసురు
లకు లేకయుండదు నని వెండియు. 42

భరతుండు ప్రతివచనం బిచ్చుట

చ. దొరగరువంబున న్నిలిచి తోరముగా నను నీవు దూఱుచుం
గరగరిక న్మెలంగఁ దగుఁ గా యని సిచ్చ దొనర్పఁ బూన ని
త్తఱి వితకాని యింతయిన దానను నే ల్సమకూఱునోటు వే
దుఱయిన నాకిడం జవిటితో నగునేలను విత్తు మొల్చునే. 43

వ. అని పలికి యోర్వఁగలడెందంబుతో నాజవదారి తొంటిబాములయం
దలిపనులు మిగులుటంజేసి బరువునకు సైఁచి పల్లకి మోయుచుం
దొంటియట్లు జనుచుండె నపు డెఱుకఁ గోరి చనునాదొర డెందంబు
ముడి విచ్చునట్టియతనిపలుకులు విని తనయుల్లంబున. 44

శా. ఔరా! యేమిది వింత యయ్యో! నిటు లే నాడంగ నిం పొప్పఁగా
మాఱాడెం గన యీతఁ డెవ్వఁడొకో తా మార్మేనితో వచ్చి నా
కాఱుల్ సైఁచినగొప్పవాఁ డొకఁ డగున్ గాదంటిమా బోయలం
దేరీ యిట్టిరు కల్గిరే యొరులు నే నేమేమి పొల్లంటినో. 45

పఱేలు భరతుని కాళ్ళపైఁ బడి ప్రార్థించుట

వ. అని దిగ్గిన పల్లకి డిగ్గ నుఱికి యప్పుడమిదేవరయడుగులం బడి గరువం
బంతయుం దిగఁ ద్రావి చేతులు జోడించుకొని యి ట్లనియె. 46

శా. అయ్యా! యెవ్వఁడ వీవు? గోఁచియును లే కైనట్టివేసంబుతో
నిర్వ్యాజం జనుచున్నవాఁడ వలమిన్నేర్గాల్పవో వేల్పవో
నెయ్యం బొప్పఁగ నన్నుఁ దేర్చుటకునై నేఁ డిందు జూపట్టినా
నెయ్యుం డౌకపిలుండవో తెలిపి నానేరంబు సైరింపవే. 47

చ. ఎఱుఁగక మోఁతలో నిలిపి యెన్నియొ కాఱులు వల్కి దూఱియున్
గరకరి దప్పుఁ జేసితిని నాదగునేరము లెంచ కేలు మే
పెఱవను బ్రొద్దుచూల్గుదెకు బెద్దగరంబున కగ్గికిం గరం
బరయఁగఁ బాఱుతిప్పలకు నాత్రముతో వెఱఁ జెందినట్లుగన్. 48

వ. అయ్యా ! నీవు తగులంబు విడిచి జడనువడినవడువున నుండి కప్పు వడిన తెలివి కలిగి మెలంగుచున్న వాఁడవు నీపలుకులు పెనుమినుకుల కుం బుట్టుడై తలంచుటకును నుడువుటకును దరంబులు గాక యున్న యవి నేను గతివేల్పుపొల్పునం బొడమిన కపిలునికడ బమ్మవిద్దె తెలియం గోరి చనుచున్న వాఁడ నీవు మాఱురూపున నన్నుఁ బ్రోవ వచ్చినకపిలుండవు గాఁబోలుదువు వెంబరవిత్తు లగునావంటిగేస్తులు తపసిరాయలలోనికత లెల్లఁ దెలుపంగఁ గలరు నేను రాయఁ డనియెడు గరువంబున విఱ్ఱవీఁగుచు పెద్దలం దూఱి గోడు మూటఁ గట్టికొంటి నదినీయక్కటికంపు నాపునం దీఱుగాని యొంటం గాదు. ఎల్లర నొక్క లాఁగునం జూచుమీా కీసు గలుగ నేరదు. అనదల మగు మాబోఁటి వారిం జెడకుండఁ గాపాడు మనిన భరతుం డతని కిట్లనియె. 49

భరతుఁడు పల్లకీవానికి నీతులుచెప్పి జ్ఞానోపదేశము చేయుట.

మ. ఒడయండా ! విను పెద్ద లీజగమునున్ వాల్పొక్కిగాఁ బల్కుచున్ విడుపుం బేరిటి తాన మొందుటకునై వేడ్కన్ దగం గొందు ర ప్పుడు నీవాడినమాట లెల్లఁ జదివెం బో యీతఁ డన్నట్టి పెం పెడలె న్నీ వన నేనునం గనెవఁ డే నేల్వాడనే నిన్నుహా. 50

ఉ. ఈవు దిరంబుగా నిలువ నెంచితివే కద యీజగంబులోఁ గావున నన్ను నెయ్యమునఁ గావుము సైఁపుము నేర మంచు లోఁ గావరము దగన్ విడిచి కాళ్ళపయిం బడి వేఁడి తీవు మే లీ విటఁ దప్పఁ జేసితివె ? యెవ్వరి కెవ్వరు ప్రోచువారునుణ్. 51

క. పల్లకి మోయించుట నని, యుల్లంబున నుండఁ బోలు నోహో నీ కేఁ దొల్లిఁటి చెయ్వులకతమునఁ, బల్లకి మోసితిని నీదుపని యిటఁగలదే.

క. కను గానక తొలిబాముల, నొనరించినవెల్ల వెనుక నొందఁగఁ దగు ని ట్లన నొప్పుఁగాని చేయిం,పను జేయంజాణయొకఁడుపరఁగునె చెపుమా.

వ. అని పలికి యూరకున్న వెఱఁ గంది యగ్గోఁచిపాతరాయనికి దండంబు పెట్టి యూరాయండు మఱియు నిట్లనియె. 54

మ. తెగులుం జెందుటఁ గుందుమానిసికి నెంతే మందు చందంబునన్
దగఁజే మిక్కిలి వేఁగువారలకు నెప్డుం జల్లనీ రట్లు పెం
పుగ నోనీసము పెద్దపాముకటువన్ బొల్పేది యున్నట్టినా
కొంగి నీపల్కనుమంతరంబు తగనై యొప్పించె నోదేవరా. 55

ఆ. నన్నుఁ గన్నతండ్రి నాసందియము లెల్ల
నిన్ను నడిగి తెలియ నున్నవాఁడఁ
దనరఁ జెప్పు నేను దాసైతి ననియెడు
దాని నెనరుఁ దోపఁ దపసిరాయ. 56

వ. అనిన నతం డతనిం జూచి రాయా! నీవు రాయఁడ వను గరువంబు
నం బల్లకు లెక్క తిరుగుచుండుటయె కాని యెప్పుడుం బెద్దలపేరోల
గంబులం దిరిగి నేర్చి యుండినవాఁడవు గావు. ఎల్లయుసురుదాల్పుల
పిండునకున్ మనికి యగునీజగంబు బూటకంబున నొనరింపంబడియె
నిది నిక్కంబై యుండునది కా దని వెండియు. 57

తే. పుడమి నీవులచే నింటఁ బొసఁగుఁబనుల
వలన నెల నగ్గి ప్రొద్దులఁ గొలుపుచేతఁ
బ్రాఁబలుకులచే నెందుచే బమ్మ మరయఁ
దగదు పెద్దలఁ గొల్చినఁ దగినయట్లు. 58

క. ఓజమెయి నెపుడు పెద్దలఁ
బూజించుచు మంచిదారిఁ బోయెడువాఁ డా
తేజునఁ బొలిచెడువిషుపుం
దాఁ జను నని ప్రాఁబలుకులతలలే వలుకున్. 59

మ. ఒడయండా! విను మేను దొల్లి భరతుం డోహో యనం జేర్మి నొ
ప్పెడుతేఁడన్ దగులంబు వాసి యడవిన్ వేఁగించుచున్ న్నాళ్ల లొ
క్కెడ నీ రాడుచు లేడిపిల్లఁ గొని యెంతే ప్రేముడిన్ సాఁచుటన్
బుడమిన్ లేడికిఁ బుట్టి వెండియును బాము ల్బొందితి న్వింటివే. 60

చ. వలమురి తొల్పునందుఁ గడు బత్తి మెలంగుచు నుంటిఁ గాస నం
పొలు పఱియున్న మే న్విడిచి పుట్టతి నిట్టులు జన్నిగట్టునై
తెలివి యొకింత కల్గుటను దిక్కుల వెన్నుఁడు దక్క నొక్కఁడుం
గలుగఁ డటంచు నెంచుచు నొకండ మెలంగుచు నుంటి నిట్టుగన్. 61

వ. రాయా! యెల్లవారలు పెద్దలం గొల్చుటం జేసి తగులంబులం బెడఁ
బాసి తెలివి గలిగి సిరిచెలువునిం గొలుచుచున్న యెడ విడుపుం
జెందుదు రని మఱియును. 62

ఉ. ఇల్లనుకాఱుకానఁ దమ కేదియు కోరి మెలంగుచుండెఁ దా
రల్లన వచ్చి కోర్కులనునార్వురు దొంగలు పున్నె మన్నసొ
మ్మెల్లను దొంగిలించుకొని యేగిరయంతట దిక్కులేనిదై
యుల్లము పల్లటిల్ల గొగ లొందెడు మానిసిపిండు మొదుగన్. 63

తే. కాపురం బనునడవిలో నేపుమీఱు
నాలుబిడ్డలు నాఁబడునట్టినక్క
లెల్లఁ జెలరేగి మానిసియెముక లెల్లఁ
గొఱికి తిన వాఁడు పాడయి యుఱికి చచ్చు. 64

తే. అడవిలోపలఁ గొఱవిదయ్యంబుఁ గాంచి
యగ్గి గొన వెంట నరిగెడువనువు దోఁప
నాలుబిడ్డలఁ బ్రోవ సొమ్మాసఁ జెంది
మెలఁగుఁ గలవారియిండ్ల పంచలను వెడఁగు. 65

క. ఎడ నెండమావులం గని కడుదగ నీరాడునిచ్చఁ గాల్కొలఁదిం బా
ఱెడు మెకములవడువున, నవ్వెడఁగులు కాపురము సేయ వెడ లెదరొడయా.

క. ముక్కాలిముదుక లైనను, ఱొక్కము గడు నిచ్చెనేని రోయ కతనికిన్
జక్కని కన్నెల నమ్మెద, రక్కట పాలసులు వారి నజ్ఞుఁడ తఁచున్.

క. నీ కీకాని యొనంగెద నీకసుగందువుచు బట్టి కడతేర్పు మనం
బోకంత నందియుంపడ, కాకట్టిడి చంప నుండు నవ్వాని నయో. 68

క. కలుములుగలిగెడునపుడే, దెలిసికొనం గన్నబిడ్డ నేఁ జెలినే
 బొలియింపవెనుకఁదీయరుతులువలువారలకు జముఁడుపోసఁగుల్లార్చున్.

మ. తెరువు ల్గొట్టుచుఁ గన్నపెట్టుచును బ్రాఁతిం జూడ మె స్డాడుచున్
 దరిఁ దాటోటు లనెన్నియేఁ బలుకుచున్ దా రెంగిళుల్ మెక్కుచున్
 బరికింపం గలయట్టి చెడ్డపనులం బాటించుచున్ రొక్కమీ
 వరుసన్ బ్రోఁగులు వెట్టి దాఁప జెనఁటుల్ పా టుంది పోకార్తు రౌ.

క. పులినంజుపైన మెసవుచుఁ, గలుద్రావుచు నోడలుమఱచి కన్గానక యొ
 ప్పులవారిం దూఱెద ర,త్తులువల కిం దందు మంచిత్రోవలు గలవే.

క. ఇరుగుంబొరుగుల గరితల,వరుసయు వావియును లేక వడిఁజెఱచుచు నె
 త్తఱి గండకావరమ్మునఁ దిరిఁగెద రవ్వారిపేరు దెలిపినఁ జెడు గా.

చ. చదివితిఁ గైతఁ గట్టితిని చాల యసంబు గడించితిన్ ననున్
 బదుగురు మెచ్చుచుండి రిఁక నాకుఁ బురు డొకరుండు లే డటం
 చెద గరువంబునన్ మెలఁగు చెంతల నేవియుఁ దండ్రి నేనియుం
 గొదుగక దూఱుమోఱకుఁపుగుం గొద లంటక పో వ వెన్నియేన్. 73

వ. మఱియు నట్టిదోసకారులోరులు మూఁజీన వగచుచు నాఁకలింగొన్న
 వాఁడు గొడ్డుచెట్టుల నాసించునట్లు దొరలం జేరి కొల్చుచు దగఁ
 గొని నీరులేనిపాడునూతిం జేరినట్లు పాలసులం గూడుచు మేను గాలిన
 వాఁడు కాఱుచిచ్చుఱికినట్లు పాయలం జేరి బువ్వఁ గోరుచు సొమ్ము
 నకై తల్లిదండ్రులు నన్నదమ్ములు లోనగుచుట్టంబుల నైనం బట్టి
 చంపుచు నిట్లు పెక్కుచందంబులఁ జెడుపనులవలనం బవళ్ళును నిదుర
 మొదలగువానివలన రేలునుం బోకార్చుచు నొండేమియు నెఱుంగక
 కాపురం బనుగడ్డిగప్పినపాడునూతం బడి యిడుమలం బడుచు వేఁగి
 వేఁగి తుదకుఁ జచ్చి జమునివలనం గొదలంబడుచుండు రని యెండియు.

ఆ. పనులకతన లచ్చి పెనిమిటిఁ దలఁపక
 కాకి గ్రద్ద కొంగ గములతోడఁ

బురుడు వచ్చునాలిబూతంబు లను జెల్మిఁ
గలసి చెడుచు వారివలన నరక. 75

చ. తలఁచిన నోకలింత లగుదట్టఁపుఁజెట్టను గొట్టుకొంచు బ్రేఁ
గులు పరము ల్పొరల్తనదుకస్తుకపు న్మొయికిం గడంకమై
దళముగఁ జుట్టఁ బెట్టుకొన దారి యొకింతయు లేక వేఁగుచున్
వెలలఁ దలంబె పో పొలఁతిపెగ్గడుపన్ చెఱసాలయం దటఁన్. 76

తే. ఇరుకుత్రోవను వెలివచ్చుతటిని యుక్క-
ముక్కలకుఁ బోనియెమ్ములనొక్కటలకుఁ
బుట్టువాఁ డొందునంగద పోల్చి చూడ
నగపు పుట్టకపో దెట్టివానికైన. 77

క. గట్టా! పుట్టఁగ నగుని
క్కట్టులు వాఁ డెట్టిదొట్టకట్టిఁడి యైనన్
జెట్టఁడు నాదాయకు నేఁ
బుట్టక పోవలయుఁ గాక పో యొకమీఁదా. 78

చ. పుడమినిఁ బడ్డనాఁడుసుత పోయెడుదాఁక గడేని సమ్మళం
బెడఁదకు లేక యాఁకలికి నేఁకటిచిద్దర కెందు కెందు కె
ప్పుడును మెలంగుచున్ జెడుగుపోఁకల నాళ్ళులు వెళ్ళఁబుచ్చుచున్
వెడఁగులు మిత్త్రివాతఁ బడి వేఁగుదు రాజముపీట నక్కటా! 79

మ. పదియాఱేఁడులపాయ మొప్ప మొయికం బాటింప కెవ్వారినిన్
మదిలోఁ గావర మెప్పు పెచ్చి పెరుగన్ మానేదియు న్వావియున్
వదలంగాఁ బెరచేడెలం దగిలి దున్నం బోలి తాఁ జెడ్డయై
తుద కేసారును లేక చచ్చు నిత గాదో వానిపుట్టలికా. 80

చ. గరితలఁ బెండ్లియాడి చెలఁగన్ గొమరుల్ దగ నిల్లు దీర్చి కాఁ
పుర మొనరించుచున్ సుఖము పొందెద మే మను సంతసంబుతోఁ
దిరుగుటె కాని దాన నగుతిప్ప లొకింతయుఁ గాన రయ్యయో
యరయఁగ గుండె జల్లు మను నయ్యవి వాకొనునట్టిపాటివే. 81

క. మడఁతులకేఁ గొడుకులకేఁ, జెడు గగుపను లబ్బెనేని చెప్పఁగ నవి య
వ్వెడఁగుల వేయగువారలఁ, బడయఁగ నెవ్వాఁడుగోరు బాబూ! చెపుమా

తే. అడరులేమిడి నైనఁ బేరాస నైనఁ
గడఁగి బొంకాడి యేనియుఁ గన్నపెట్టి
యేని కడు జూద మాడియే నెట్టులేని
సొమ్ము గడియించు నదె వానిసొంపు డింపు. 83

చ. బ్రతికినయన్ని నాళ్ళిటులు బాములకే యగుకాఁపురంబు నా
విత యగుపేరిఁకోఁ దవరి వీఁగక మండెడుకారుచిచ్చులో
సతముగ నేగి వే మిడుతచందమున న్బడి వేఁగి వేఁగి యా
మతకరి చచ్చి పుట్టు నది మానెడుదారి నెఱుంగఁ బోలదో. 84

క. పిచ్చుంగుంటియు గ్రుడ్డియు
హెచ్చుగ నగుచెవుడు మూఁగ యొంటియు తెవులున్
వచ్చినముదుసలివాఁడును
జచ్చుచునుం గొమ్మఁ గవయఁ జను నాహాహా! 85

తే. చన్ను లపరంజికుండలు కన్ను లాణి
తమ్ము లొడలెల్ల బంగార మమ్మ యనుచు
నింతిఁ గోరు నంజుడుముద్ద లెసఁగుపుసుల
తొఱ్ఱిలును గుళ్ళు కు ళ్ళువి తొలఁగ రకట. 66

క. పెనుబామువిసం బాడ లెక్కన మందుల డింప వచ్చు గెరలెడిచెలిచూ
పనువిసము డిగక చెఱచున్, వినుమీ చెలిచూపువిస మువిసమే విసమౌ.

చ. ఒరులకు నూడిగంపుఁబను లొయ్యనఁ జేసియు నేలఁ ద్రొవ్వియున్
జెఱువులనీరు తోలియును జేలును జెట్టులు ప్రోఁది వెట్టియున్
బరువడి నేమి లేక తను పాడగు మే నది పండుఁ గాని యె
ప్పురుసునఁ బండ కాస చిలవ ల్పలవ న్గొనుచుండు నెప్పుడున్. 88

క. తిన నాఁకు లలము లుండఁగఁ, గొన నేళ్ళ నీళ్ళు లుండఁ గొసరకకట్టం
జనునార లుండఁ బాడం,గ నేల లుండ నొరుఁ గొల్వఁగా నేమిటికిన్,

ఆ. బ్రతుకు తరగలాట పసిజవ్వనము కొన్ని
నాళ్ళ మాట సుకము నీళ్ళమూట
బోఁటి సొమ్ము కొడుకు మేటిమెఱుపు శేఁట
యేటికయ్య! మట్టిపాటిబాట. 90

చ. తెలియఁగ నెంతవారు నొగిఁ ద్రెళ్ళిర కాని యొకండు మిత్తిక
న్నుల మసిఁ బ్రామి పొల్చుట కనుంగొనియే వినియే నెఱుంగ మీ
పొలిసెడునంతయున్ వినియు బూమె తెఱంగియు నుట్టిగట్టియు
య్యెల లిటు లూఁగుచుందు మని యెంచుట వెఱ్ఱితనంబు కాదొకో.

చ. మిసమిసలాడుచుం దమకు మే లిడుచుండెడునంత దాఁక సే
పసిఁ గొని బందుగుల్ గొలిచి వత్తురు లేమిడి జిక్కినప్డు రా
రుసు లెడలంగ మేను చెడి యున్నెడ నే మన నేవగించెడు
న్విసుగుగొనుం గడుం దెగడు నెచ్చెలియు న్మనరేది వింటివే. 92

తే. కాపుర మనుకడలి నీఁద నోఁపురారి
యెట్టిగొదలను దీర్చెడునట్టిదారి
పుట్టి చావని సుక మిచ్చునట్టిదారి
బమ్మ మరయుట యని లోన నమ్ము తేఱి. 93

చ. దళముగఁ గంటికిం బొరలు దాకకమున్న నొడ ల్వడంకుచున్
మలఁగకమున్న లోఁదెలివి మా నఱి పోవక మున్న కాళ్ళు సే
తులు సెడిపోకమున్న తగుత్రోవలఁ బోనగు నిండ్లు గాల రా
వుల నొగిఁ ద్రవ్వఁ బూనుటలు పోలునొకో తలపోసి చూడగన్.

వ. అని మఱియు బాటసారి యేచుఁగుం జూచుచు లోఁతునూతం బడి
చచ్చిన తెఱంగునఁ గాపురంబునం గ స్తిపడుచు నడుచువాఁడు జెడుం
గావున నీవు రాయఁడ నను గరువంబు విడిచి యన్నిటియందు సరి
యగుచెలిమి వాటించి తెలివి యనుక త్తిచేఁ దగులం బనునడవి నఱికి
మీఁదిదారిఁ దెలిసి మెలంగఁ దగునని వెండియును. 95

క. మన మన బమ్మం బనఁగాఁ,గనఁగొన వేఱెంత యేని గలుగదు సుమ్మీ
తనలోన నీళ్లు తెలిసిన,తనుపో మఱి పుట్టి చాక తన రెడునతఁడున్.

ఆ. ఉసురు దాల్పులందు నెనఁగుమానిక మూక
దానియందుఁ దెలివి నూనినట్టి
తపసిరాయఁ డతని కెపుడుఁ జాలినవాఁడు
వేల్పు లేఁ డటంచు నిల్పు మీవు. 97

వ. ఆతపసి గోచియుం బెట్టక పిచ్చివానివలెం దిరుఁగుచుండు నతం డే
దేవర యతనిఁ గొలువ నన్నియుం జేకూరు నని యెఱింగించిన సంత
సించి యతం డతనికిఁ జాగిలి మ్రొక్కి యి ట్లనియె. 98

ఉ. పాఱుకొలంపుమానికమ! పట్టిపయిం గలగారవంబునన్
మీ రెఱిఁగించుసుద్దులను మీఱిననాచెడుబుద్ధియంతయున్
దీఱెను దోసముల్ నడిచెఁ దెల్వియు మించెను నాకొలంబునన్
జేరెను బున్నె మే విడుపుఁ జెందెద మీయడు గంటి కొల్చుటన్.

తే. నీదుపలుకను చందున నాదులోని
గరువ మనిమెడుకటికిచీఁకటి దొలంగె
తెలివి యనుపండువెన్నెల తేఱి కాయు
దొంగ లార్వురు తిరుగక లొంగినారు. 100

ఆ. నీదుబోధఁజేసి నాదులోఁ గడుతెల్వి
నైన సంతసం బటనెడునిండు
చందమామ నొడిచె నిందందుఁ గలబమ్మ
మన్నసొమ్ముఁ గంటిఁ గన్నతండ్రి. 101

శా. మీఱం గావర మూరకే చెడఁగ నోమీబిడ్డ నన్ బ్రోఁచుటన్
మీరే తల్లులు మీరే తండ్రు లనఁగుల్ మీరే దొరల్ బందుగుల్
మీరే వేల్పులు మీరె యెల్లరును మిమ్మే నమ్మితిం జుండి లో
నేరు న్నీకును వేఱు లేరు గదె తండ్రీ పీనినిం గావుఁడీ. 102

వ. అని కడుదెఱంగులఁ గైవారంబుఁజేసి వేఁడుక మెయి వీడుకోలు వడసి యతం డన్నియునుం బెడఁబాసినవాఁడ కాన వెంగలి యన నెటయేని యూఁడనిం బాడె నంత నాభరతుండునుం దనకు మేనుగలకజ్జంబు దీఱెఁ గానఁ బొల్లింటి గండకివాఁకయొడ్డునకుం జని ఘూరుచుండి మెండ గుబ్బత్రిందనదెందంబునం దనకువేఱుగానినాని నిట్లని తలంచుచుండె.

చ. నలకలకన్న నల్కయి కవంబడి పెద్దలకన్నఁ బెద్దయై
నెల పొకపోటు నాక మఱి నింగియు నేలయు నిండఁ బొంగియున్
దులవలకెల్ల లే డనఁగఁ దోఁచెడుదేవర తాను నేన యై
వెలిఁగెడుజోతినిం దలఁచి వేయుఁదెఱంగులఁ గొల్తు నిచ్చలున్. 104

ఉ. ఈ వన నొక్కఁ డే ననఁగ నెంచ మఱొక్కఁడనే జగంబులో
నీ వన నే ననంగ నొకఁడే యగు సందియ ముండ నైన నిం
ి వన నే ననంగ నుడు లేగక యున్నవి రెండు వానినిం
బోవఁగఁ జూచి నన్ను నినుఁ బొందఁగఁ జేసి కడంకఁ బ్రోవవే. 105

ఆ. తలఁపఁ బేమగోలె నలువవఱకు నంత
నీవ యగుచు నంత నీదులోన
నుండె నంతలోన నుండఁగ నీవు నీ
యంతఁ జేయుచుంటి వయ్య తండ్రి. 106

ఉ. నింగియు నేల గాలియును నీళ్ళును నగ్గియు నీదురూపటం
చుం గలతొంటిమిన్కు లవి చొప్పడఁ జెప్పుచు నుండఁ దండివై
పొంగుచు నిజ్జగంబులను బొంది రవంత యెడంబు లేక నిం
డం గనుపింతు వం చనుట న్యాయముగా నినుఁ జేరి రెల్లరున్. 107

ఆ. మెఱుఁగుజోతి పోలె మెఱుఁగుచు నాలోన
నున్ననన్ను నేన యెన్నికొలుతు
నిన్ను మాఱు గాఁగ నీవు దిరుండవు
జగము దిరముగాని సరణి తెలిసి. 108

క. తలచుటకుం బలుకుటకుం దల మిసుమంతియును గానిదయ్యమ! నిన్నుం
గలసినకతమున నేమో, తలఁచుచునుంటిని వెలుంగుతలఁపున జేజే.

వ. అని పలుదెఱంగులఁ దలపోయుచు దివ్వె దివ్వెం గలసినట్లు బమ్మం
గలసి మెలసి మెలంగుచుండె. 110

క. అని శుకుఁడు పరీక్షిత్తున,కు ను దెలిపినయట్లు శౌనకుఁడు మొదలగుబా
పనజేండ్ల కిట్లు సూతుఁడు,వినిపించెన్ భరతుకతను వేడుక మీఱఁగన్.

క. భాగవతంబునఁ గలకత,బాగుగఁ దిలకించి యిట్లు వ్రాసితి దీనిన్
వీగక చదివిన వినినన్,వేగమ సమకూరు తెలివి వెడలని సిరియున్.112

ఆ శ్వా సాం త ము

మాలిని. కుదు రెపు డగురాయా! కూళరాకాసిదాయా!
మొదటఁ బొడమునయ్యా! ముజ్జగం బేలుజియ్యా!
చదువుపజలపట్టా! సా దుచున్నట్టిదిట్టా!
పెదతపసులప్రాపా! పేర్మినై నుండుమాపా! 113

గద్యము. ఇది శ్రీమహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిరాజ,
కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి
ప్రణీతంబయిన బ్రహ్మానంద మను
నచ్చతెలుఁగు ప్రబంధంబున సర్వం
బును దృతీయాశ్వాసము

శ్రీ శ్రీ శ్రీ

---

# పంచరత్నములు.



క. శ్రీపీఠికాపురీశ్వర, గోపాలకృపావిశేషగుణభూష ధరి
త్రీపాల వినుతవిభవ, వ్యాపక శ్రీసూర్యరాయ వరకవిగేయా.

మ. అల గంగాధర భూధరేశ్వరవరాత్మాంచత్కుమారుండవై
విలసచ్ఛాస్త్రముఖప్రసక్తిని జగద్విఖ్యాతిగా నొప్పి భూ
తలమం దున్నతశక్తిఁ దాల్చి కలుషాద్రిగ్రావభేదంబు పే
రలుకం జేసి యశంబు గంటివి కుమారా! పీఠికాధీశ్వరా.

మ. పరిషద్దక్షిణ వేనవే లిడి కళాభవ్యాంధ్రభాషాంతరాం
తరదోషంబు లడంగిపో సుకృత మేతద్భూమిభాగంబునన్
స్థిరతం జెందఁగఁ జేసి తట్టి విజయశ్రీపీఠికాపట్టణే
శ్వర! నీ విప్పటి కృష్ణరాయఁడవు గావా సూర్యరాయండ వా.

మ. పసివాఁడై తగునప్డె తండ్రియును నాపైఁ దల్లియుం బోయిన
న్మిసిమింతుం డయి రాజకీయములఁ బేర్మిం గెల్చి ధర్మస్థితిన్
వసుధారాజ్యభరంబుఁ బూని సుకవివ్రాతంబు లగ్గింపఁగాఁ
బస మీఱం బ్రజ నేలు రావుకులరాడ్వర్యుండు సామాన్యుఁడే.

చ. సహజగుణంబు శాంత మది స్వాంతమునం పొలు పొంద దాయనే
సహనమునం గనుంగొనుచు సంతతముం గరుణార్ద్రచిత్తుఁడై
మహిపతి యైన వేంకటకుమారమహీపతిసూర్యరాయఁ డి
మ్మహి నిరమిత్రుఁడై నృపతి మండలమండితుఁడై తలిర్చుతన్.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.